# లియో టాల్ స్టాయి.

(రామమోహన్)

విశేషమైన ఘటన లేమీ లేని యీ జీవిత చరిత్ర- నెపోలియన్- కాసనోవా- లివింగ్ స్టన్ ల జీవితముల కన్న హృదయాకర్షకంగా ఉంది. దానికి కారణం- టాల్ స్టాయి లోని గొప్పదనమే. .........

లియోనార్డ వుల్ఫ్.

జూలై ౧౯౩౫

విశ్వసాహిత్య మాలా ౧.

# లియో టాల్‌స్టాయి.

(రామమోహన్)

విశేషమైన ఘటన లేమీ లేని యీ జీవిత చరిత్ర- నెపో
లియన్- కాసనోవా- లివింగ్‌స్టన్‌ల జీవితముల కన్న హృద
యాకర్షకంగా ఉంది. దానికి కారణం- టాల్‌స్టాయి లోని
గొప్పదనమే. ..........

లియోనార్డు వుల్ఫ్.

జూలై ౧౯౩౫

# హెచ్చరిక

ఒకజాతి అభివృద్ధికి రావాలీ, అంటే ముందా జాతిలో ఉత్తమమైన వాఙ్మయం నిర్మించబడాలి. ఆ వాఙ్మయం నిర్మించే ప్రయత్నంలో మేమితర దేశీయుల రచనల కనువాదాలు చేయమనడం, పరదేశీయుల ఆధిక్యతను హర్షించమనడం గొప్పతప్పు. ఎందుచేతనంటే విజ్ఞానం ఒక జాతియొక్క సొమ్ముకాదు.

అల్లాగే......

ఏమనిషైనా అభివృద్ధిలోకి రావాలన్నా, విజ్ఞానవంతుడు కావాలీ అన్నా, ప్రపంచసాహిత్యం అంతా ఆకళింపుకు తెచ్చుకోవాలి. ప్రపంచ విజ్ఞానంలో తనకీ హక్కుందని జ్ఞాపకం తెచ్చుకోవాలి. అందులో కూడా గర్వం— అహంకారం, అభిమానం— పొందడం వ్యర్థం!

ప్రతిమనిషీ— ప్రతిజాతీ— "తనది" అనేగర్వంలో ప్రపంచంకేసి చూడకుండానే స్వకీయ వాఙ్మయం నిర్మించుకోవాలని తలస్తూంటుంది. ఆ ఉత్సాహంకి ఫలితం అపజయమే! ... ఎందుచేతనంటే ఏజాతేనా అభివృద్ధికి రావాలన్నా, ఏవాఙ్మయమేనా అభివృద్ధిలోకి రావాలన్నా ప్రపంచ సంఘట్టనం అవసరం. ప్రపంచంతో సంబంధం పెట్టుకోని భాష— వాఙ్మయం— సంస్కృతములాగే ప్రచారాన్నుంచి దూరమైపోతుంది—

అందుచేత నోపాఠకుడా!... ...

ఏజాతికైనా సరే ... పతనాభివృద్ధులు కల్పించ
గలది ... ...

ఏమనిషికైనా ... జ్ఞానాజ్ఞానాలలో ముంచేసేది
ఐన సాహిత్యం నిర్ణయించుకొనడంలో సావధా
నంగా ఉండు.

ఆ సావధానతయే నిన్ను విజ్ఞాన శిఖరాని కెక్కిం
చినా ... లేక పాతాళమున కణగ త్రొక్కినా —
కనుక ... జాగ్రత ... ... ...

అల్లాంటి ఉత్తమమైన వాఙ్మయాం తన భాషలో
సంపాందించబడే ప్రయత్నాలలో యథాశక్తి తోడ్పా
తనకి ... తన భాషకి ... ఉపకరించడం ప్రతీ వ్యక్తి యొక్క
కర్తవ్యం!

ఆ కర్తవ్యం నిర్వహించే బాధ్యత
మనది!!!

# పోషకులు.

మ. రా. శ్రీ. నిష్ఠల శ్రీ రామకృష్ణమూర్తిగారు,
తాణేలంక.

... ... ... ఖండవిల్లి సుబ్బారాయుడు గారు,
ముంగండ.

... ... ... ప్రొప్రైటర్సు పండితరాయ ముద్రాక్షరశాల, ముంగండ.

... ... ... పెయ్యల లక్ష్మీనృసింహ సోమయాజులు గారు, ముంగండ.

# సహాయులు.

... ... ... [illegible]త్రివాది సుబ్బారాయుడు గారు,
ముంగండ.

## లియో టాల్‌స్టాయి.

జననము; యాస్నాయాపోలియానా, టూలా,

సెప్టెంబరు, 9. 1828.

మరణము, అస్టపోవో, రైజాన్,

నవంబరు, 22, 1910.

## "ప్రేమ — పరిశ్రమ"

మానవజీవితమునకు ముఖ్యావసరములు.—

— టాల్‌స్టాయి

# పరిచయం.

లియో టాల్‌స్టాయి పూర్తిపేరు "కౌంట్ లియో నికో లేవ్ టాల్‌స్టాయి." లియోనికోలేవ్"- తల్లితండ్రులు పెట్టిన పేరు. "టాల్‌స్టాయి"-వంశమిచ్చిన యుపనామం. "కౌంట్" ఆ తడు పుట్టినవంశ గౌరవాన్ననుసరించి వచ్చిన బిరుదనామం. ర ష్యాలో అనేకమంది లియోనికోలేవ్‌లు- అనేకమంది టాల్ స్టాయిలు-అనేకమంది కౌంట్‌లు-పుట్టేరు.కాని"కౌంట్ లియోని కోలేవ్‌టాల్‌స్టాయి" లేక సంగ్రహరూపంలో"లియో టాల్ స్టాయి" అనేపేరు ఆఒక్కమనిషినే; దీనుల్ని-దరిద్రుల్ని-పైకి తీసుకురావడానికి తనజీవితం అంతాధారపోసిన ఆఒక్కవ్యక్తినే ప్రపంచానికి జ్ఞాపకం తెస్తుంది.

లియోటాల్‌స్టాయి పుట్టింది- ధనం- అధికారం కొఱ కెంతెంత దురంతాలకైనా వెనుదియ్యని జమీందారీ కుటుం బంలో. కానిజమీందార్ల చెడుగుణాలేవీ యాతనికిసంక్రమించ లేదు. ధనం వుందని ఎవ్వరిని తృణీకరించలేదు. అధికారంవుం దని యెవళ్లని బాధించలేదు.జీవితంఅంతా దరిద్రుల్ని, అసహా యుల్ని, రక్షించడానికై తోడి జమీందార్లతో పోరాడి కీర్తి పొందిన మహనీయుడు టాల్‌స్టాయి.తనకున్న ధనం అంతా దరి ద్రులికి సాయం చెయ్యడంలోనూ,శక్తిఅంతా నిస్సహాయులైన ప్రజలకు సాయం చెయ్యడంలోనూ,జీవితం అంతా ప్రపంచానికి మంచిమార్గం చూపడంలోనూ, వినియోగ పరచిన స్వార్థ త్యాగి.

అతడు మనుష్యహృదయ మెరిగిన మహాజ్ఞాని. వాఙ్మ
తత్వ మెఱిగిన గొప్పపండితుడు. కళారహస్య మెఱిగిన మహాశిః
అతని భావాలు హృదయాన్ని చూరకొంటాయి.
తని రచనమనస్సున కుత్సాహమిస్తుంది.కల్పన మిక్కిలి సహజ
గా వుంటుంది. మనుష్యజీవితంలోని ప్రతీ చిన్నఘటనకీ క
రూపం ఇయ్యగల ఉత్తమరచయిత టాల్‌స్టాయి.
అతని రచనావైదగ్ధ్యం ప్రపంచహృదయాల నా
ర్షించింది.అతని విశాలహృదయం వాటిలో స్థిరనివాసం ఏర్ప
చుకుంది.
అనేకమంది ప్రజలు తినడానికొక్కరొట్టెనా లేక యల్లాడి
తూంటే కొద్దిమంది ముష్టాన్నలా విలువైనతిండితింటూండడ
వేలకొద్దీజనం చలికి ఆగే బట్టైనా లేక బాధపడుతూంటే కొ
మంది ఒక్కొక్కబట్టకై వందలకొలది రూపాయలు ఖర్చుచే
డం-జనసామాన్యం కాయకష్టపడి తమపొట్టకొక్క గింజేనా
గుల్చుకోకుండా ఆదాయం అంతా యజమానుల చేతుల్లో
స్తూంటే-ఆ అమాయకుల పొట్టకొట్టి దాన్ని త్రాగుడు క్రింద
జూదం క్రిందా ఖర్చు పెడుతూండడం ఆలోచించేటప్పటికి టా
స్టాయి మనస్సు కెంతో బాధకలిగింది.
వెక్కుమంది ప్రజలనెత్తికొట్టి పెద్దపెద్దఆస్తులు పోగేసుకు
ర్చేకం అతని దృష్టికి మహాపరాధంగా తోచింది. వేలకొ
జనుల్ని కట్టుకొనడానికి పదిగజాల నేలైనా లేక అక్క

క్కూడా అటమటిస్తూంటే, తాను యిరవై వేల యెకరాల భూమికి ఖామందగుట న్యాయదృష్టిలో మహానీచంగా కనిపించింది. ఆ నై చ్యాన్ని ంచి తప్పుకోడానికి వెంటనే—భార్య— బంధువులూ, అడ్డుపెట్టినా—బెదిరించినా—కూడా లక్ష్యం చెయ్యకుండా టాల్‌స్టాయి తన ఆస్తినంతా ప్రజోపయోగంకి వెచ్చబెట్టేసి-జీవితాం తందాకా పల్లెటూరి ప్రజలతో సమంగా కాయకష్టపడిగడిపేడు

తనభావాల్నీ- రచనల్నీ- బోధల్నీ- ప్రపంచంలో ఒ క్కభాగంకే ఉపయోగింప చెయ్యడం మనుష్యుని సంకు ? దృష్టికి నిదర్శనం అని టాల్‌స్టాయి నిశ్చయం. జాత్యభిమా దేశాభిమానం- మానవుని యల్పదృష్టికి నిదర్శనాలు. : చనలూ- భావాలూ, ప్రత్యేకభాషకీ- ప్రత్యేకవ్యక్తికీ- క్రయించడం గ్రంథకర్త యల్పదృష్టికి నిదర్శనం. కనుకనే టా స్టాయి తన రచనలమీద స్వత్వం తానుంచుకోలేదు. ఒకరికివిక యించలేదు. భార్య పట్టుదలా-గ్రంథవిక్రేతలు చూపే ధనాశ ఆతని యభిప్రాయాల్ని కదిలించ లేకపోయినాయి.

కాని ఒక్కమాటుమాత్రం ఆతడు నిశ్చయం మార్చు కోక తప్పిందికాదు. అదైనా నిస్సహాయంగా- ప్రభుత్వంచేత దూరదేశాలు తరమబడుతూన్న దరిద్రప్రజల ప్రాణరక్షణం కోసమే! టాల్‌స్టాయి ప్రపంచాకాశంలో ఒకదివ్యతార! సాహిత్యసముద్రంలో దారిచూపే జ్యోతిర్మూర్తి!!

మనుష్యులోకాని కాదర్శపాత్రం!!!

రష్యారాజధానియైన "మాస్కో"నగరంకి నూటముప్పై మై
దూరంలోయున్న "టూలా" నగరసమీపంలో "యాస్నోయ
పోలియానా" అనే జమీందారీ ఉంది. ఆగ్రామజమీందా
నింట 1828. వ. సం॥ఆగష్టు 28వ తేదీన సువిఖ్యాతయశస్కుడై
లియో టాల్‌స్టాయి జన్మించేడు.

ఆతని తండ్రిపేరు నికోలస్.తల్లిపేరు మేరీ వాల్కాన్‌స్కీ
వారిద్దరుకూడ యున్నతవంశీకులే. రాజకుటుంబముతో సమీ
బాంధవ్యం ఉన్నవారే. ఆదంపతులకు పుట్టిన ముగ్గురు బిడ్డల
లియో అంతిముడు. అతని పెద్దయన్న పేరు నికోలస్ డిమిత్రి
రెండవ వానిపేరు సర్జియస్.

లియో టాల్‌స్టాయి మూడేళ్లవాడై యుండగా అత
తల్లియైన మేరీ వాల్కాన్‌స్కీ చనిపోయింది. నాటినుండి "తా
యానా ఎర్గొలస్కీ"యనునామె యాబిడ్డల్ని ముగ్గురిని అతి
మతో పెంచింది.

తాతియానా నికోలస్‌నకు సమీపబంధువురాలు. మొ
మొదట నికోలస్ నామె పెండ్లిచేసుకొనగోరెను. కాని తనత
దండ్రుల దారిద్ర్యము దలపోసి,తనతోడి వివాహము నికోల
భ వ్యభివృద్ధికి భంగకరం అని నిశ్చయించి-ధనికురాలు - రా
కుటుంబీకురాలు అయిన మేరీ వాల్కాన్‌స్కీతో అతని వివా
వమున కంగీకరించెను. తాతియానా కాతనిపైగల నిష్కప

ప్రేమ యామె నిట్టి స్వార్థత్యాగానికి ప్రేరేపించింది.

నికోలస్ వివాహమైపోయిన వెనుక తాతియానా అవివాహితగానే ఉండిపోయి వారింటనే తానుప్రేమించినవాని భార్యకు చెలిమికత్తెయై, ఆతని పుత్రులకు పెంపుడుతల్లియై ఆతని శుభమునే కాంక్షిస్తూ నివసించింది.

మేరీ మరణానంతరం నికోలస్ తాతియానాతో వివాహ ప్రస్తావం మళ్లీ చేశాడు. కాని ఈ వివాహం నికోలస్ పుత్రులక్షేమానికి- అభివృద్ధికి- భంగకరంఅని, ఆమె తనస్వార్థం చంపుకొని వివాహానికంగీకరించలేదు.

తాతియానా స్వార్థత్యాగిని. ధర్మం- మతంఅంటే అభిమానంగలది. ప్రేమపూరితమైన హృదయము గలది. టాల్‌స్టాయి యొక్క జీవితంలో తాతియానా యుత్తమోత్తమగుణాలు సంపూర్ణంగా ప్రతిబింబితాలైనాయి.

లియోకి తొమ్మిదేళ్లుండగా నికోలస్‌కూడా పరలోకంకి ప్రయాణంకట్టేడు. ప్రపంచం తెలియని బాల్యావస్థలోనే లియో మాతాపితృహీనుడైనాడు. అప్పటినుండి నికోలేవ్ పెద్దన్నగారి సంరక్షణలోనే పెరిగినాడు. డిమేట్రీ తనతమ్ముళ్లని చాలాదయతో శ్రద్ధగా పెంచేడు. లియో భవిష్యజ్జీవితంకి పునాదులు వేసినవాడు డిమేట్రీయే యని చెప్పకతప్పదు.

లియో టాల్‌స్టాయి బాల్యావస్థనుగూర్చివ్రాయ వలసినంత విశేషాంశాలేవీ లేవు. అతడుకూడా జమీందార్లబిడ్డ లందరిలాగే అతిగారాబంతో పెంచబడ్డాడు.ప్రపంచం అంతా తమబోటి ధనవంతుల సుఖవిలాసాలకొరకే సృష్టించబడినట్లు నేర్పబడ్డాడు. భోగవిలాసాలు జీవిత పరమావధి యన్నట్లు ప్రవర్తించేడు. ధనవంతు లందరి వలెనే విపరీతమైన అహంకారంతో బాధపడేవాడు. దినమందు చాలాఘంటలు జుట్టు దువ్వుకొనడం-బట్టలు సవరించుకొనడంలో గడిపివేసేవాడు. స్త్రీలోకం అంతా తన సౌందర్యాని కాకృష్టం కావాలనీ,ప్రపంచంలో అధికమైన అందం కలవాడుగా పేరు పొందాలనీ, నిరంతరం సుఖస్వప్నాలు కంటూండేవాడు.

కాని ఎంతగా విలాసాలు గోరువాడైనా, ఎంత భోగవాంఛయున్నా, అతనిలో ఒకసద్గుణం లేకపోలేదు. అది యీ భోగవిలాసాలమధ్య కూడా స్పష్టంగా కనిపిస్తూండేది.చిట్టచివరకా సద్గుణమే యాతని జీవితాన్ని పతనావస్థలోనుండి యుద్ధరించింది.

ఆతని నుద్ధరించిన యీ సద్గుణం విమర్శనాశీలం. ఏవిషయాన్నైనా బాగా ఆలోచించి విమర్శించడం ఆతని స్వభావం. ఏకాంత ప్రదేశంలో ఒక్కడూ కూర్చొని ప్రతీ

చిన్న విషయంలోను లేశలేశాలు విమర్శించడం అతనికి ఇష్టం. అతడెప్పుడూ స్నేహితులకీ-బంధువులకీ-దూరంగా ఉండేవాడు.

చిన్నతనంలో తల్లితండ్రులకు దూరమైన పిల్లలందరివలెనే లియో టాల్‌స్టాయి సంకోచశీలుడైపోయినాడు. నలుగురున్నచోటికి పోవడానికి సిగ్గు. కొత్తవాళ్లతో స్నేహం చెయ్యడానికి భయం. పైకి గట్టిగా మాటలాడడానికి సంకోచం. ఎప్పుడూ జనసమాజానికి దూరంగా ఉండడం, తనలో తానే ఆలోచించుకుంటూ కూర్చొనడం,అతనికి పరిపాటైపోయింది. లోకంలో గొప్పదుర్గుణాలకి కారణమయిూ ఈ ఏకాంతప్రియత్వం లియో టాల్‌స్టాయిలో ఒక మంచిగుణానికి కారణంగా పరిణమించింది. ఏవిషయానైనా- ఎంతకఠిన సమస్యనైనా జాగ్రత్తగా ఆలోచించి విమర్శించగల శక్తీ అవకాశమూ కలిగించింది. ఆలోచించనిదే ఏపనీ చేయకపోవడం, విమర్శించనిదే ఏమాటా తేలకపోవడం అనే సద్గుణాలకి మూలకారణం ఆతని సంకోచస్వభావమే.

ఏకుర్రవాడూ చిన్నతనంలో విన్నమాటలు మరచిపోలేడు. చిన్ననాట మనస్సుకు పట్టిపోయిన భావాలు జీవితాంతం దాకా స్థిరంగా ఉండిపోతాయి. కాని టాల్

స్టాయి విమర్శస్వభావం మనుష్యస్వాభావికసీమల్ని కూడా అతిక్రమించింది. టాల్‌స్టాయి ఏడెనిమి దేళ్లవాడై యుండగా డిమేట్రీసహాధ్యాయి ఒకడు వారింటికి వచ్చి మాటలధోరణిలో, "భగవంతు డనే వాడున్నాడనడం శుద్ధ అబద్ధం. ఆతని అస్తిత్వం నిరూపించడానికి తీసుకు వచ్చే నిదర్శనాలన్నీ ప్రజలని మోసగించడానికి వేసిన ఎత్తులు."- అని కళాశాలలో తాను నేర్చిన విషయాలు ప్రకటించేడు. అప్పటిమట్టునకు టాల్‌స్టాయి మనస్సులో ఆమాట లంకితా లైపోయినాయి. కాని వాటియొక్క భావం మనస్సునకు పట్టలేదు. తరువాత-తరువాత మాస్కో- నగరంలో చదువుకొనే రోజుల్లో ఆనాడు విన్నమాటల యాదార్థ్యం చాలవరకు విమర్శించడానికి అవకాశం కలిగింది. మతం-మతాభిమానం అన్నది వట్టి మూర్ఖత్వం, బూటకమూ అనీ- ఈశ్వరుడనే వ్యక్తి యెవ్వడూ లేడనీ- ఉన్నా ప్రపంచంలోని మంచిచెడ్డలతోనూ- మతాలతోను సంబంధం ఏర్పరచుకొనేపాటి వాడు కాదనీ- పుణ్యం-పాపం, నరకం-స్వర్గం, అనేవి వట్టి అబద్ధాలనీ- వాటి పేరు చెప్పి ప్రపంచాన్ని భయపెట్టి స్వల్పసంఖ్యాకులు సుఖం పొందేటందుకు వేసిన ఎత్తులనీ-టాల్‌స్టాయి తేల్చుకున్నాడు.

విద్యాభ్యాస కాలంలో ఆతని మనస్సులో అంకితమై పోయిన ఈ భావాలే భవిష్యత్తులో "మతం- జీవితపరమావధి." మొదలైన యుత్తమవిషయాలని గురించి "గతానుగతికో లోకో" అన్నట్లు కాకుండా, స్వతంత్రంగా ఆలోచించగల సమర్థుణ్ణి చేశాయి.



టాల్‌స్టాయికి పదిహేనేళ్లు వచ్చేవరకు మాస్కో
లోనే చదువుకొన్నాడు. అక్కడి పాఠశాలలో ప్రాథ
మికవిద్య పూర్తయినంతనే కళాశాలలో చేరి చదువ నిశ్చ
యించి ప్రసిద్ధికెక్కిన "కాజాన్" విశ్వవిద్యాలయం
1843లో పోయిచేరేడు. కాజాన్ విశ్వవిద్యాలయం కేవల
జమీందార్లబిడ్డల కొరకే పుట్టింది. దరిద్రులకా కళాశా
లావరణంలో కాలు పెట్టడానికైనా యవకాశం లేద
అక్కడి జీతాలు- ఖర్చులు- భరించగలవాళ్ళు ధనవంతు
లొక్కరే.

కళాశాలలో చేరిన మొదటి యేడాది టాల్‌స్టా
యికి ప్రాచ్యభాషల (Oriental Languages) మీద
బుద్ధిపారింది. కాని విద్యావిధానంలోని లోపం ఆత
ఉత్సాహం చంపేసింది. ఎన్నడూ మార్పెరగని యాపూర్వ
ధోరణి, చదువుమీద అసహ్యం కలిగించింది. విద్యార్థు
స్వతంత్రశక్తినీ- విమర్శాశీలాన్నీ ప్రోత్సహించని పాఠ్య
పుస్తకాలు, సహించలేని గురువులు; ఆతని స్వతంత్రాభి
ప్రాయాలకి- విచారపూర్ణస్వభావానికి- నచ్చలేదు. కనుక
పాఠశాలలో చేరిన కొద్దిరోజులలోనే విద్యార్థు లందరి

వలెనే యాతని మనస్సుకూడా నిర్జీవం- నిరుత్సాహకరం
అయిన పాఠ్యపుస్తకాలనుంచి మళ్ళి, మనస్సు నుత్సాహ
పెట్టి తాత్కాలికంగా నైనా జీవితంలో సౌఖ్యలేశం కన
బరచగల వస్తువులను వెతకడం ఆరంభించింది.

ఆరోజులలో "కాజాన్" విలాసవస్తు సామగ్రికి
ప్రసిద్ధికెక్కిన పట్టణాలలో ఒకటి. నాటకశాలలు- నర్తన
శాలలు-మద్యశాలలు-జూదపుటిళ్ళు-పడుపుటిళ్ళు-ఒక్క
టేమిటి- సకల వ్యసనాలకీ పేరు పొందింది "కాజాన్"
నగరం. గొప్ప గొప్పజమీందార్లు- ధనికులు- రాజవంశ
యులు- వాటిని పోషించేవారు. విశ్వవిద్యాలయంలో
చదువుపేరు చెప్పి చేరిన జమీందార్ల పిల్లలంతా చదు
వుసంధ్యలు కట్టిపెట్టి యీ భోగవిలాసాల వెంట పడే
వారు. టాల్‌స్టాయికూడా సహాధ్యాయుల మాదిరిగానే
"కాజాన్" నగరవీధులలో స్వేచ్ఛావిహారా లారంభిం
చేడు. ఆటపాటల హడావడిలో కళాశాలలోని పాఠాల
ధోరణే యుండేదికాదు. స్వేచ్ఛావిహారాలలో పాఠ్యపుస్త
కాల జ్ఞాపకం ఉండేదికాదు. తత్ఫలితంగా ఆసంవత్సరం
టాల్‌స్టాయి సాలుసరి పరీక్షలలో పరాజయం పొందక
తప్పిందికాదు.

మరుసటి సంవత్సరం టాల్‌స్టాయి కళాశాలలో

మరొక విషయం తీసుకొని చదవడం ఆరంభించేడు.ప్రాచ్య భాషలు తన కుత్సాహకరంగా లేవని న్యాయశాస్త్రం తీసుకొన్నాడు.కళాశాలలో చేరిన మొదటిరోజులలో వెన కటి సంవత్సరం జరిగిన పరాభవానికి సిగ్గుపడి పుస్తకాల విషయంలో కాస్త శ్రద్ధ కనబరచేడు.కాని ఆవిషయంకూడా అతని కుత్సాహం ఇయ్యలేకపోయింది. అతడెంత ప్రయత్నం చేసినా మనస్సు పుస్తకాల మీాదికి వెళ్లేది కాదు. చిట్టచివరకి పరీక్షల ఫలితం పూర్వవిధంగానే జరిగినా అతడు చేసిన ప్రయత్నం-విమర్శనా-ఆతనికి న్యాయశాస్త్రంలో కొంతజ్ఞానం కలగచేసినాయి.పరీక్షలఫలితం వ్యతిరేకంగా తేలగానే అతనికి నిరుత్సాహం పుట్టి మళ్లీ మామూలు మార్గం తొక్కేడు.

అభిమానించి తీసుకున్న రెండు శాస్త్రాలలోను అపజయం పొందడానికి టాల్‌స్టాయి బుద్ధిహీనత కారణం కాదు. అసాధారణ బుద్ధే దానికి కారణం. అతడే విషయాన్నైనా సులభంగా గ్రహిస్తాడు. ఆలోచించగలడు. విమర్శించగలడు. ఆతని కభిరుచియున్న విషయాల నాలోచించడంలోను,ఎంతకఠినమైన విషయాన్నైనా అతిచులకనగా గ్రహించడం లోను- అతని బుద్ధి చాలాతీవ్రంగా ఉండేది. ఏవిషయాన్నైనా విమర్శించి స్వతంత్రంగా తన

అభిప్రాయాన్ని నిర్ణయించుకొనేవాడు. కాని ఎవరో చెప్పినారని కళ్లుమూసుకొని తలయూపే రకం కాదు. ఉన్నతాదర్శాలు- స్వతంత్రాభిప్రాయాలు కలిగి- తీవ్రమైన బుద్ధిగల యాతనివంటి విద్యార్థులు తమబుద్ధిని- గురువులు చెప్పే చిన్నచిన్న విషయాల మీదనే కేంద్రీకరింపచేసి- వాటిలోనే క్రిందు మీదగుచుండడం చాలాకష్టం. అసంభవం. తెలివితేటలు, స్వయంవ్యక్తిత్వం ఉన్న విద్యార్థులు సామాన్యంగా పరీక్షలలో దండయాత్రలు సాగిస్తూ ఉండడం- నట్టమట్టిబుర్రలు చులకనగా పరీక్షలలో నెగ్గుతూండడం ఈకారణంచేతనే. సామాన్యంగా ప్రస్తుత విద్యావిధానములో పుట్టి పెరిగిన ఏవ్యక్తీ స్వతంత్రమైన ఆదర్శాలు- అభిప్రాయాలు- ఉన్నవాడిని సహించడం కష్టం. ఎప్పుడూ ఎవ్వరినో అనుకరిస్తూ, ఎంగిలి మాటలతో కాలక్షేపం చేసేవాణ్ణి చూస్తే గురువులకి- ప్రజలకి- పరీక్షకులకి ఎంతో అభిమానం- ప్రేమాకూడా.

టాల్‌స్టాయి పరీక్షలలో నెగ్గినా-మానినా న్యాయశాస్త్రాన్నే చదువుతూ, 1848. వ. సంవత్సరంవరకు "కాజాన్"లోనే కాలక్షేపం చేశాడు. ఆసంవత్సరం డిమేట్రీ తనచదువు పూర్తిచేసి ఇంటికి ప్రయాణం కట్టేడు. టాల్‌స్టాయికి కూడా తన స్థితిగతులు చాలాఅస

హ్యాంగా కనిపించినాయి. చదువుపేరుచెప్పి తానిక్కడ
కాలక్షేపం చెయ్యడం తనజీవితం వ్యర్థంగా పాడుచేస
కోవడమేనని నిశ్చయించినాడు. వెంటనే పుస్తకాలు.
బట్టలు సర్దుకొని కళాశాల చదువు కొక్క నమస్కారం
చేసి అన్నగారితో యింటికి చేరుకున్నాడు.



ఆత డింటికి వచ్చునంతకు అతని జీవితంలో శాశ్వతమైన మార్పు గలిగించగల పరిస్థితులు ప్రత్యక్షమైనాయి. ఆరోజులలో రష్యా దేశంలో ఒకవిధమైన బానిసత్వం అమలులో వుండేది. ప్రతీదేశంలోనూ ఉన్నట్లే దేశంలోని భూమి అంతా జమీందార్లనబడే ఏకొద్దిమంది చేతులలోనో వుండేది. మిగిలిన ప్రజలంతా ఒక్క భోజనానికే కాక ఇంటి స్థలాలకొరకుకూడా వాళ్ళనే ఆశ్రయించవలసివచ్చేది. ఏనాడో జమీందార్ల నాశ్రయించి వాళ్ళ భూములలో కాపురాలుండి- వాళ్ళ భూములు కౌళ్ళకు చేస్తూవచ్చిన ప్రజలు కాలక్రమేణ ఆజమీందార్ల బానిసలుగా పరిణమించేరు. భూములతోపాటు వాళ్ళుకూడా యజమానుల స్వంత ఆస్తులలో చేరిపోయారు. వాళ్లక్కడనుంచి పోయేటందుకు చట్టా లొప్పవు జమీందారిష్టపడ్డా. క్రియవిక్రియాలలో భూములతో పాటు అందులో ఉన్న ప్రజలు కూడా చేతులు మారవలసిందే.వాళ్ళ కేవిధమైన హక్కులు లేవు. ఏచట్టాలూ-ఏప్రభుత్వం వాళ్ళ కష్ట నిష్ఠురాలు విమర్శించ లేవు. వాళ్ళకి స్వత్వం అన్నది లేదు. స్వతంత్ర్యం ముందే లేదు. వాళ్లు జమీందార్ల

సౌఖ్యవిలాసాలు సమకూర్చే సజీవయంత్రాలు. అంత అస్వతంత్రులుగా ఉండడంచేతనే జమీందార్లు వాళ్ల ఎడల చాలా నిరంకుశంగా ప్రవర్తించేవారు. కొట్టినా- తిట్టినా- చంపినా ఇదేమనడానికి వీల్లేదు. కోర్టుల కెక్క-డానికి సామర్థ్యంగాని, స్వాతంత్ర్యంగాని, ఆనిర్భాగ్యుల కు లేదు. ఏవిధంగానైనా తంటాలుపడి కోర్టుకెక్కినా ప్రభుత్వం అంతా జమీందార్లదే కనక న్యాయం జరగడం మాట అల్లావుంచి ఎదురు వీళ్లకే బాధ కలిగేది. ప్రాణ హాని కలిగించినా- మానహాని కలిగించినా ఎదురుమాట చెప్పడానికి వీల్లేనంత నిరంకుశంగా జరిగిపోతూండేది ఆ జమీందార్ల జులుం.

లియో టాల్‌స్టాయి చదువుచాలించి స్వగ్రామం చేరుకొనేటప్పటికి పరిస్థితులిల్లా ఉన్నాయి. ఈఅన్యాయం దేశంలో చాలాకాలం నుంచి వేళ్లుపారి ఉన్నా లియో విద్యాభ్యాసంపేరుచెప్పి జ్ఞానం వచ్చినప్పటినుంచీ పట్టణాలలో ఉండిపోవడం చేత-పల్లెటూళ్లలో జరుగుతూ వున్న ఈ అన్యాయా లెప్పుడూ అతని కంట బడలేదు, జ్ఞానంవచ్చిన వెనక పల్లెటూళ్లవైపు కన్నుతిప్పట కిదే ప్రథమ పర్యాయం.

విపరీతమైన స్వాతంత్ర్యకాంక్ష గల లియో ఆ

ప్రజల అస్వాతంత్ర్యపు బ్రతుకును సహించ లేక పోయేడు. తోడి మానవులు ఆ విధంగా బాధలు పడుతూంటే, ప్రజలా నై పునకు దృష్టి యుంచకపోవడం అతనికి చాలావిచారం కలగచేసింది. వెంటనే ప్రజలదృష్టి నావంకకు త్రిప్పి బాధలతో చితికిపోతూన్న బానిసల పరాధీనత్వం పోగొట్టే ప్రయత్నం చెయ్యాలని నిశ్చయించేడు ఆ అమాయకుల దురవస్థలు చూడడం-వినడం వల్లకలిగిన హృదయవేదనసంతా కలం లోంచి ప్రవహింపచేశాడు. వాళ్ళ కష్టాలూ- వాళ్లకి జరుగుతూ ఉన్న అన్యాయాలూ, వర్ణిస్తూ జమీందార్లు ఆ దరిద్రులకి స్వాతంత్ర్యం ఈయవలసిన ఆవశ్యకతని ప్రకటిస్తూ, A morning of a landed proprieter. అను చిన్న నవల నొకటి వ్రాసి ప్రకటించేడు.

అతని యీ ప్రయత్నం ప్రజలలో కొంతవరకు సంచలనం కలిగించింది, కాని ప్రజలయొక్క ఆవేశాన్ని ఉద్రేకాన్ని, కూడకట్టి కార్యరూపంలోనికి తేగల శక్తి లియో దగ్గర లేదు. ఆనాటి కాతని బుద్ధిప్రాయాల ల్లాంటి ఘనకార్యాలు నిర్వహించ గలంత సమర్థంగా లేవు. తల పెట్టినపని నిర్వహించ బడేదాకా ఓపగ్గం లాగగల ఓపికా స్థైర్యం కూడా అతనిలో తక్కువే. ప్రజల బాధలు— జమీందార్లు చేసే దురంతాలు— చూసిన మీద కలిగిన

ఆవేశంలో తన జీవితం అంతా వాళ్లని బాగుచేసే టం
దుకు వినియోగించాలని నిశ్చయించినా,ఆఅభిప్రాయాలు
త్వరలోనే అడుగున పడ్డాయి. అతని హృదయంలో సుఖం
భోగం- విలాసాలమీద ఆశ ఇంకా చల్లారలేదు. పొంగు
తూవున్న యౌవన రక్తం— చేయి మునగా డబ్బు— మంచి
ఆరోగ్యం- సౌందర్యం అన్నీ కలసి యాతని మనస్సుకు నిల
కడ లేకుండా చేసేశాయి. అతని భోగతృష్ణ ప్రశాంత
ముగా విశేషం మార్పు లేకుండా ఉండే పల్లెటూరి జీవనం
మీద కంటె- ఉత్తేజకంగా ఉండే పట్టణవాస జీవనం
మీద అభిమానం చూపింది. వెంటనే టాల్‌స్టాయి తన
ఆదర్శాలకి స్వస్తి చెప్పివేసి మూటముల్లెలు సవరించు
కొని సెంటు పీటర్స్ బర్గ్ [పెట్రోగ్రాడ్] చేరుకున్నాడు

పెట్రోగ్రాడ్ చేరుకొన్నాక లియో టాల్‌స్టాయి
జీవితం సంపూర్ణంగా నైతిక పతనానికి పాల్పడింది.
పేకాట- జూదం- తాగుడు- మొదలైన దుర్వృత్తుల
కలవాటుపడి పోయినాడు. డబ్బులేనప్పుడు అప్పులు ప్రా
రంభించేడు. దానితో వలసినన్ని దుర్గుణాలు పట్టుబడ్డాయి.
దానికి తగినట్టే ఆతని మనస్సు కూడా స్థైర్యం అనేది
ఎరగకుండా నిముషాని కొకదారితొక్కేది.ఒకక్షణంలో
దేశాలు తిరగాలని కోరిక. మరునిముషంలో కళాశాల

చదువు పూర్తిచెయ్యాలని దుగ్ధ. ఒకమాటు దేశసేవ-ప్రజాసేవ- చెయ్యాలనే ఆదర్శం. వెంటనే మనుష్య జన్మం భోగవిలాసా లనుభవించడంకే యనే భావపతనం. ఒకక్షణంలో సాహిత్యసేవ చేసి కీర్తిగడించాలని ఆశ. మరొక క్షణంలో యుద్ధరంగంలో పేరుపొందాలని కోరిక. ఈ విధంగా ఆతని మనస్సు చుక్కాని లేని పడవ మాదిరిగా- భావప్రవాహం ఏమూల కీడుస్తే ఆమూలకి పరుగులు పెట్టుతూ ఉండేది.

రెండేళ్లకు పైగా లియో టాల్‌స్టాయి యీవిధంగా అస్థిరజీవితం గడిపి కడకు విసిగి పోయినాడు. అతి పరిచయంచేత భోగాలమీద ఆసక్తి తగ్గింది. ఎక్కడికైనా వెళ్లిపోయి ప్రశాంతంగా జీవించాలని కోరిక పుట్టింది. దానికితోడు అప్పులు పెరిగి పోయినాయి. తీరేఉపాయం లేదు.ఏసైన్యాలలోనో చేరి అప్పులు తీర్చాలని నిశ్చయం కలిగింది.

సరిగ్గా ఘటనలు కూడా అనుకూలపడి టాల్‌స్టాయి పతితజీవితం ఉద్ధరించబడటానికి ఆనుకూల్యాలేర్పడినాయి.

లియో పెద్దన్నగారైన నికోలస్ డిమేట్రి "కాజాన్" కళాశాలలో విద్యాపూర్తి చేసుకొని సైన్యాలలో

యుద్యోగిగా చేరినాడు. వెంటనే కకేషియస్ ప్రాంతా
లలో ప్రజా విప్లవం అణిచెయ్యడానికి పంపబడుతూ ఉన్న
ఫిరంగిదళంలో ఉద్యోగిగా చెయ్యబడి కకేషియస్ పంపి
వెయ్యబడ్డాడు. 1851 లో డిమేట్రి కొన్ని నెలల పాటు
ఉద్యోగానికి సెలవు పెట్టి స్వగ్రామం వచ్చేడు. తమ్ముని
స్థితిగతులు చూచేడు. ఆ పువ్వులరంగణ్ణి ఇంక ఈప్రదే
శంలో వదిలేస్తే లాభం లేదనుకున్నాడు.ఉన్నాడా అంత
కంతకి అతని జీవితం ధ్వంసం అయిపోతుంది. ఏదైనా
పనిలో ప్రవేశపెట్టితే ఆతని పరిస్థితులు మారవచ్చునని
యాతడూహించేడు. మంచి చెడ్డలన్నీ ఆలోచించి తమ్ము
నితో తన యభిప్రాయం అంతాచెప్పి తనతో "కకే
షియా" రమ్మన్నాడు.

అవకాశం దొరికితే ఎక్కడికైనా పోదామని
చూస్తూన్న టాల్‌స్టాయి అన్నగారి ప్రస్తావనకి వెంటనే
అంగీకరించేడు. పేకాటలలో పెట్టిన తాకట్లూ,విలాసాల
కోసం చేసిన అప్పులూ,నెత్తిన తన్నుతూన్నాయి.వాటిని
తీర్చడానికి ధనం అవసరం. లియో టాల్‌స్టాయి ఆకాశ
హర్మ్యాలు నిర్మించుకుంటూ అన్నగారివెంట "కకేషి
యా" చేరుకున్నాడు.

"కకేషియా" చేరుకొన్న కొద్దిరోజులదాకా

టాల్‌స్టాయికి పూర్వవాసనలు వదల లేదు. అక్కడకు వెళ్లిన తర్వాత కూడా కొద్దిదినాల దాకా వేట- జూదం పేక- తాగుడు మొదలైన దుర్వ్యసనాలు విడిచి పెట్ట లేకపోయాడు. దగ్గరనే ఉన్న డిమేట్రీ మరల హెచ్చరించడంతోనే కళ్లు తెరచేడు. ఒక్క మాటుగా తన దుర్వ్యసనాలకి సెల విచ్చేడు. వెంటనే "టిఫలిస్" నగరం చేరి సైనిక కళాశాలలో పేరు చేర్పించుకున్నాడు.

టాల్‌స్టాయికి చదువు మీద నెక్కడ లేని శ్రద్ధా కలిగింది. కాలేజీలోని ఉపన్యాసాల విషయంలో విపరీతమైన శ్రద్ధ తీసుకున్నాడు. ఈలోపుగా తనకు చిన్ననాటి నుంచీ సాహిత్యం మీదనున్న అభిమానం పెంపొందించు కొన్నాడు. ఇప్పుడాతని బద్ధకం- దుర్వ్యసనాలు ఏమైపోయినవో అతడా వైపునకేనా తొంగి చూడడం లేదు.

"టిఫలిస్" కళాశాలలో చదువుతూ ఉండగానే లియో "Boy hood" అనే తన రెండవ నవల పూర్తి చేసేడు అది పూర్తైపోయి నంతనే- పెట్రోగ్రాడ్ నుంచి ప్రకటింప బడుతూ వున్న ఒక మాసపత్రికలో ప్రకటించడం కొఱకు పంపించేడు. ఆ పత్రికా సంపాదకుడు రష్యాలో కెల్ల పేరుపడ్డ కవుల రచనలే గాని ప్రచురించే వాడు కాడు. లియో టాల్‌స్టాయి నవల యాతని దృష్టిని పూర్తి

గా ఆకర్షించింది. సంపాదకుడా నవలను మంచిఉత్సాహం
సంతోషం వెలిబుచ్చుతూ ప్రకటించేడు. సంచికలో సం
దకుని యభివందనాలతో ప్రచురింపబడ్డ తన గ్రంథాన్ని
చూచుకొని లియో టాల్‌స్టాయి సాహిత్యజీవితంలో
తాను పొందగల యభివృద్ధిని తలచుకొని పొంగిపోయేడు

టాల్‌స్టాయి ఆసంవత్సరం పరీక్షలలో కూడా ఉత్త
మతరగతిలో కృతార్థుడైనాడు. పరీక్షాఫలితాలు ప్ర
టించ బడినంతనే సైన్యాలలో ఉద్యోగం దొరికింది. ఆరో
జులలో కకేషియస్ ప్రజలలో రేగుతూన్న విప్లవాగ్నిని
చల్లార్చి వాళ్లనణిచి వెయ్యడానికై నియమించబడ్డ సేన
లలో ఫిరంగి సైన్యములో ఆతడు కూడా ఒక ఉద్యోగిగా
నియమించ బడ్డాడు.

లియో టాల్‌స్టాయి మహోత్సాహంతో ఉద్యోగధర్మాలు నెరవేరుస్తూ, కొంతకాలం వెళ్ళబుచ్చేడు. కాని ఆతని మనస్సు చాలరోజులా పనియం దుత్సాహం చూపలేదు. ప్రజలని భయపెట్టేటందుకు నాలుగు వీధుల మొగలలో ఫిరంగులతో కొలువుచేయడం, తుపాకులు భుజాలమీద వేసుకొని వీధులవెంబడి కవాతు చేయడం ఆ ఆర్భాటాలు- అట్టహాసాలు, లియో ప్రకృతి కెంత మాత్రం నచ్చలేదు. ఇంక నాతడు వీలు-సెలవు దొరికినప్పుడల్లా కకేషియస్ పర్వతాలలోని ప్రకృతిదృశ్యాలలో తన్మయుడై విహరిస్తూనో, వేటాడుతూనో, మాసపత్రికలకి చిన్నచిన్న కథలు వ్రాస్తూనో, భవిష్యత్తంతా ఊహాచిత్రాలతో అలంకరించుకొంటూనో, కొంతకాలందాకా మనస్సు కుత్సాహం కల్పించుకున్నాడు. కాని ఆ ఉత్సాహం కూడా చాలారోజు లుండలేదు. సైన్యాలలో వ్యర్థంగా పడి ఉండడం ఆతనికి నచ్చిందికాదు. వెంటనే తను ఉద్యోగానికి రాజీనామానిస్తూ కాగితం పంపించేడు.

ఇంతలో ఆతడు పంపించిన రాజీనామా పత్రం

ధృవపరచబడకుండానే టర్కీ- రష్యాల మధ్య చరిత్ర ప్రసిద్ధమైన "క్రిమియా" యుద్ధం ప్రారంభం అయింది.

1774 వ. సంవత్సరములో టర్కీ- రష్యాల మధ్య నొకసంధి జరిగింది. ఆ సంధిపత్రంలోని కొన్ని సంధిగ్ధ వాక్యాల కర్థసమన్వయం చేయడానికీ- పాలస్టయిన్‌లోని క్రైస్తవ పుణ్యస్థలాలమీద నధికార నిర్ణయం పేరుచెప్పి ఆ రెండు ప్రభుత్వాలు తుపాకు లెత్తినాయి. వాటి నను సరించి నెమ్మది నెమ్మదిగా ఇంగ్లాండు- ఫ్రాన్స్- సార్డీనియా ప్రభుత్వాలు కూడా యుద్ధరంగంలో కాలుపెట్టి నాయి.

యుద్ధం ప్రకటించ బడగానే లియో టాల్‌స్టాయి తాను పంపిన రాజీనామా పత్రాన్ని ఉపసంహరించు కొని యుద్ధరంగములోనికి పోవడానికి అనుజ్ఞకోరేడు. ఆ సమయమున టాల్‌స్టాయి మేనమామ "గోర్ట్‌చెకోఫ్" రాజకుమారుడు రష్యా సేనాధ్యక్షుడుగా ఉన్నాడు. "గోర్ట్‌చెకోఫ్" వెంటనే లియో ప్రార్థన నంగీకరించి తన సహాయసేనాధిపతులలో ఒకణ్ణిగా చేర్చుకొని రణభూమికి పంపడాని కిష్టం చూపేడు.

యుద్ధం ఆరంభం అయింది. ఇరుపక్షాల ముట్టడు లారంభమైనాయి. వెంటనే 1854 నవంబరు నెలలో

లియో టాల్‌స్టాయి యూరపియన్ టర్కీ సరిహద్దులలో నున్న "సెవాస్టోపల్" దుర్గం రక్షించుతూన్న ఫిరంగి సైన్యాలకి నాయకుడుగా నియమించబడ్డాడు. యుద్ధకళలో యాతడిచ్చిన ఉత్తమ పరీక్షా, కకేషియాలో నాతడు చూపిన సామర్థ్యం, అతని కిట్టి పూచీగల ఉద్యోగం ఇప్పించింది. సామాన్య సైనికుడుగా గాక యున్నత పదవిలో పనిచేయుడంచేతనే ఆతనికి యుద్ధం యొక్క నిజ స్వరూపం గ్రహించగలగడానికి అవకాశం ఇచ్చింది.

'పరిభువ్రలు- ధనికులు- తమ మేడలు దిగకుండానే ప్రజల్ని యుద్ధరంగాలలో చావడానికి పంపుతూన్నారు. చిన్న జీతాలమీద పోషింపబడే సైనికులు-దరిద్రులు- దాసులు చేలోపు కావడంచేత యుద్ధరంగాలలో బలవంతంగా బలి చేసెయ్యబడుతూన్నారు. యుద్ధంకి మూలకందాలైన మహామహులంతా దూరదూరంగా నిల్చుని దేశం- మతం- పేరుచెప్పి వగపులు వగస్తూన్నారు. యుద్ధం ఎందుకొచ్చిందో- ఎవ్వరితో యుద్ధం చెయ్యాలో ఎరగని అమాయకులైన ప్రజలు చంపడానికి చావడానికి సిద్ధం చెయ్యబడుతూన్నారు. అనేకవిధాల ఆశపెట్టి- బలవంతపెట్టి- బూటకములైన మతోద్రేకాలు కలిగించి ఆ అసహాయులైన ప్రజల్ని పోతుల్ని గుడికి

తెచ్చినట్లు లాక్కొస్తూన్నారు. తమకోసం బలవంతం
ప్రాణాలివ్వడానికి పోతూన్న ఆ అమాయకులకి
వంతులు- ప్రభువులు చేస్తూన్న సౌకర్యా లేమిటి? వ
కుటుంబా లింటిదగ్గర తిండికోసం పూర్వాకంటే ఎక్కు
బాధపడుతూన్నారు. మూలిగే నక్కమీద తాటి పం
లా అన్నివిధాల బాధలతో సతమతం అగుతూన్న
ప్రజల కీనిర్బంధ సైనిక శాసనం- బంధు వియోగ
దుర్భరమైపోతూంది.ఇంటిదగ్గరమాట లల్లావుంచి సైని
లలో చేరినవాళ్ళమాట ఆలోచిస్తే వాళ్ళుమాత్రం
సుఖపడుతూన్నారు? యుద్ధ భూమికి పోవాలంటే స్వ
మాలనుంచి వందలకొద్దీ మైళ్ళు పోవాలి. దేశంలో
మైన బాటలు లేవు. ప్రయాణ సౌకర్యా లసలే లే
కడుపునిండా తిండిలేదు. ఒక్కొక్క రోజున ఉపవాస
వాసాలు. ఒక్కొక్కప్పు డర్ధాకలిగా తిండి. దానికితో
పెద్దపెద్ద బరువు లీడ్చుకుంటూ వందలకొద్దీ మైళ్ళు
నడకని ప్రయాణం. వాళ్ల కష్టాలు చూసేవాళ్లు- స
భూతి చూపేవాళ్లు- లేకపోయినా, ధర్మపన్నా
రువులేసి పోటీలు పెట్టడానికంతా పెద్దలే. "దూ
శంలోఉన్న మన సోదరప్రజల్ని రక్షించవలసిన బాధ
మీది" అని ప్రజానాయకులు బోధిస్తారు. ట

మనతో చేసుకున్న సంధిపత్రాన్ని అతిక్రమించింది. ఇప్పుడుకనక మనం ఊరుకున్నామా ప్రభుత్వగౌరవం చెడుతుంది. ప్రభుత్వ గౌరవాన్ని రక్షించవలసిన పూచీ ప్రజలది" అని ప్రభుత్వం శాసిస్తుంది. ఒకదాని కొకటి అతుకని ఈమాటలకీ- ఆజ్ఞలకీ- అర్థం ఏమిటని అడగనైనా అడగరాదు. తల వంచితీరవలసిందే ప్రజలు. ఎంత న్యాయం!

సైన్యోద్యోగిగా ఉన్న టాల్‌స్టాయి ఆ పరిస్థితులన్నీ కళ్లారా చూసేడు. ఏమీ ఎరగని వాళ్లని యుద్ధరంగంలో నిలువ బెట్టడానికి కూయ వలసిన అబద్ధాలు- కారులు- స్వానుభవం చేత గ్రహించేడు.

టాల్‌స్టాయి సైనికులమీద- ప్రజలమీద చేయబడుతూన్న అత్యాచారాలు సహించ లేకపోయాడు. సరియైన ఆయుధ సామగ్రి లేక వేలకొద్ది వ్యర్థంగా శత్రువుల ఫిరంగులు కురిసే అగ్నిలో మాడి పోతూన్నారు. వేలకొద్ది గాయాలు తగిలి పడిపోతూన్నారు. దెబ్బలు తిన్నవాళ్లకి మంచి నీళ్లేనా ఇచ్చే టందు కేర్పాట్లులేవు. వైద్య సహాయం అసలే లేదు. మత్తు మందివ్వకుండానే వాళ్లగాయాలు పరపర కోసేస్తూన్నారు గుళ్లు తీయడానికి. ఆబాధ తాళుకో లేక వేలకొద్దీ ఆసుపత్రిలలో చచ్చి పోతూ

న్నారు. టాల్‌స్టాయికివన్నీ చూచేటప్పటికి రక్తం ఉడుకె త్తింది. కాని వాళ్లకి చేయగల సహాయం ఏమిటి? ప్రజల యొక్కా ప్రభుత్వం యొక్కా దృష్టికి సైనికులు పడు తూన్న బాధలు ప్రత్యక్షం చేస్తే ఏమైనాలాభం కలుగు తుందేమోనని Tales from Sevestopol అనేపేరుతో చిన్న చిన్న కథ లనేకాలు వ్రాసి పత్రికలకు పంపేడు ఆతడు పడిన శ్రమకు ఫలితం కలిగింది. ఆ కథలు చదివినాక- అదివర కెన్నడూ సైనికుల కష్ట సుఖాలు కనుక్కోని నికోలస్ జార్ హృదయంలో సంచలనం కలి గించి, కొంతవరకూ వాళ్ల స్థితి గతుల్లో మార్పు కలగ డాని కవకాశం కలిగించినాయి.

"క్రిమియా" యుద్ధంలో సంపాదించిన అనుభ వంతో లియో టాల్‌స్టాయి ముందు ముందు (యుద్ధం శాంతి.) War and Peace అనేనవలతో ప్రపంచం ముందు ప్రత్యక్షమైనాడు. ఆనాడాతడు సెవాస్టోపల్ రంగంలో పనిచేసి ఉండకపోతే- యుద్ధం- యుద్ధం పేరు చెప్పి జరుగుతూ ఉన్న అన్యాయం - నైతిక పతనం- అంత స్వాభావికంగా కళ్లకు కట్టినట్లు వర్ణించ లేకపోయి యుండవచ్చును.

1855 వ. సంవత్సరంలో "సెవాస్టోపల్" శత్రు

వుల చేతిలో పడిపోయింది. రష్యా సైన్యాలు నాలుగు మూలలకీ చెదిరిపోయినాయి. యుద్ధరంగంలో జరుగుతూఉన్న అన్యాయం, యుద్ధం పేరుచెప్పి అమాయిక ప్రజల్ని ధనవంతులంతా చేస్తూన్న మోసం, చూసేటప్పటికి టాల్‌స్టాయికి ప్రథమంలో ఉన్న ఆవేశం- ఉత్సాహం అడుగంటినాయి.

"సెవాస్టోపల్" రంగము నందలి అంతిమపరిస్థితుల రిపోర్టు దీసుకొని లియో టాల్‌స్టాయి పెట్రోగ్రాడ్ చేరుకొన్నాడు. ఆరిపోర్టుతో పాటు తన రాజీనామా కాగితం కూడా దాఖలు చేసివేశాడు.

యుద్ధరంగంనుంచి ఇంటికి రాగానే టాల్‌స్టాయి మనస్సులో చిరకాలం నుంచి రేగుతూన్న విదేశయాత్ర మీాది వాంఛ మళ్ళీ మొలక లెత్తింది. చివరకా కోరిక బలీయమై యుద్ధం ఆగిపోయిన వెంటనే మూటముల్లె కట్టుకొని ఫ్రాన్స్ దేశంకి ప్రయాణం కట్టేడు.

ఆరోజుల్లో రష్యా దేశంలో రైళ్ళుచాలా తక్కువ. కనక టాల్‌స్టాయి సెంటుపీటర్స్ బర్గు [పెట్రోగ్రాడ్] నుంచి పోలండు రాజధాని వార్సా వరకూ అంచె బళ్ల మీాద ప్రయాణం చేసి అక్కడ నుంచి రైలు మీాద తిన్నగా ప్యారిస్ చేరేడు.

ప్యారిస్‌లో కొన్ని నెలల పాటుండి దేశ పరిస్థితులు సూక్ష్మ దృష్టితో పరిశీలించేడు. ప్రజా సంస్థలలో పాలు తీసుకొన్నాడు. రాజకీయరంగాల వైపు తొంగిచూచేడు. ఏమూలనైనా శాంతి- సౌమ్యత ఉందేమోనని వెతికేడు. కాని అతని కెక్కడా శాంతి అన్నమాట కనపడలేదు. నాగరికత పేరున జరుగుతూ ఉన్న దురంతాలు- దుర్ణ యాలు అతని శరీరం కంపింపచేసినాయి. అన్నిటికంటె అతని హృదయానికి విపరీతమైన బాధ కలిగించి మూలం కల్లా కదల్చిన విషయం ఆదేశంలో ప్రాణదండన నిర్వ హించబడే విధానం. శిక్షితుని తల "గిలోటిన్" అనే ఇనపయంత్రంలో మూసివేయబడేది. తరువాత కట్టింగ్ యంత్రంలోని కత్తిమాదిరి కత్తి నేరస్థుని తలను జాగ్ర త్తగా నరుకుతుంది. యంత్రంలో మూసినతర్వాత తల వేరయ్యేవరకూ ఆమనుష్యు డూపిరిలేక పడేబాధ అపరి మితం. నేరస్థుల్ని బాధించి ప్రతీకారం తీర్చుకోగల యీ విధానం- కనిపెట్టబడిన వానిపేరనే "గిలోటిన్" అని పిలువబడుతూ ఉండేది.

టాల్‌స్టాయి పారిస్ నగరమందలి యీభయంకర నాగరికతకి తాళుకోలేక వెంటనే స్విట్జర్లాండు వెళ్లిపో య్యేడు.

స్విట్జర్లాండు యూరపు ఖండంకల్లా సుందరమైన ప్రకృతి దృశ్యాలకి పేరుపడ్డ దేశం. హిందూదేశంకి కాశ్మీరంలా ఉంటుంది యూరపుకి స్విట్జర్లాండు. హిమాలయ పర్వతాలంత ఎత్తుగల "ఆల్ప్స" పర్వతాలున్నాయక్కడ. ఆ పర్వతాలలో పుట్టి- అందమైన పచ్చిక బయళ్ళలో- లోయలలో ప్రవహిస్తూ- ఉండే జినేవా నదీతీరం మానవమాత్రుడు చూడదగిన ప్రదేశం.

టాల్‌స్టాయి ఆ నదీతీరాన చాలారోజులు ప్రకృతి దృశ్యాలు చూస్తూ గడిపేడు. తరువాత కొన్నిరోజులు జినేవా నదీ తీరాన ప్రయాణం చేసి స్విట్జర్లండంతా తిరిగేడు.

టాల్‌స్టాయి లోకార్నోలో ఉండగా ఆతనికి కొందరు ఆంగ్లేయ యాత్రికులతో సంబంధం కలిగింది. ఆతడా ఆంగ్లేయులు చూపే గర్వం- అహంకారం చూసి నిర్వేరపడ్డాడు. వాళ్లు జాతిగర్వం చేత చేసే అత్యాచారా లాతని కసహ్యం కలగచేసినాయి. ఇతర దేశస్థులు, మతస్థులు అంటే వాళ్ళు చూపే అసహ్యం- క్రోధం- ఆతని మనస్సుకి బాధ కలగచేసినాయి. వెంటనే ఆతడు ఆంగ్లేయులతోడి సంబంధంలో తనకు కలిగిన అనుభవాలు వర్ణిస్తూ Albert అనే కథ వ్రాసి ప్రచురించేడు.

తరువాత నతడక్కడ నుంచి బయలుదేరి జర్మనీ చేరినాడు. కొంతకాలం ఆ దేశంలో కూడా ప్రయాణం చేసి చూడదగ్గ ప్రదేశాలు చూసి, మళ్ళా స్వదేశం-స్వగ్రామం చేరుకున్నాడు.



## ౫

విదేశాల నుంచి వచ్చిన కొద్దిరోజుల దాకా స్వగ్రామంలో ఉండి తరువాత టాల్‌స్టాయి సెంటుపీటర్స్ బర్గ్ చేరుకొన్నాడు. అక్కడకు చేరుకొన్న కొద్దిరోజులకే మాస్కో సాహిత్య పరిషత్తులో టాల్‌స్టాయి సభ్యుడుగా ఎన్నుకోబడ్డాడు. పరిషత్సభ్యులంతా లియో టాల్‌స్టాయికి బ్రహ్మాండమైన స్వాగతం ఇచ్చి గౌరవించేరు.

కాని ఈగౌరవం అతని కేమాత్రం సంతృప్తి గలిగించ లేదు.

అతనికి ధన విషయంలో ఏమాత్రం లోటు లేదు. మనస్సు చాలా మంచిది. మంచి విమర్శకుడు. పెద్ద యుద్యోగి. "సెవాస్టోపల్" రంగంలో మంచి పేరుపడ్డాడు. దేశదేశాలు తిరిగి మంచి అనుభవం సంపాదించేడు. వీటన్నింటికి తోడు రష్యన్ సాహిత్య నిర్మాతలలో పెద్ద పేరు పొందేడు.

ప్రారంభంలో లియో టాల్‌స్టాయి కివన్నీ చాలా సంతోషం, సంతృప్తి కలిగించినాయి. కాని సంవత్సరం లోపుగానే ఆతని కీపరిస్థితులు చాలా అవమానకరంగా తోచినాయి. టాల్‌స్టాయి ఆత్మపరిశోధనమే దానికి

కారణం. "మనం ప్రజల కుపయోగించే పని ఏంచేసి నాం?". ఈప్రశ్నతో ఆతనిజీవిత రహస్యం కళ్ళకి కట్టి నట్లు కనపడింది. తన ప్రవర్తనపై యసహ్యాం- పరితాపం కలిగింది. దానితో యాతని జీవితచక్రంలో పరివర్తనం కలిగింది. ఆతని జీవితానికి గమ్యం ఏర్పడింది.

సరిగ్గా ఆసంవత్సరమే మొదటి నికోలస్ చచ్చి పోయి రెండవ నికోలస్ రష్యాసింహాసనం ఎక్కాడు. మొదటి నికోలస్ కాలంలో రష్యా అంతా మంగలంలో వేగినట్లు వేగిపోయింది. ప్రజల నోళ్ళు మూసి వెయ్యబ డినాయి. పత్రికల గొంతుకుల కురు లేర్పడినాయి. ప్రభు త్వ పద్ధతి నేమాత్రం విమర్శించినా- అసమ్మతి చూపినా ప్రజలు కఠిన శిక్షల పాలు చెయ్యబడేవారు. దానికితోడు క్రిమియా యుద్ధం అంటూ వచ్చి దేశపరిస్థితులు మరింత అధ్వాన్నం అయిపోయినాయి. నిర్బంధంగా ప్రజలు ఫిరంగుల ముందుకి తోసివెయ్యబడ్డారు. యుద్ధం కార ణంగా లక్షలకొలదీ జనులు చచ్చిపోయారు. వేలకొద్దీ మైళ్ళ భూమి ధ్వంసం అయిపోయింది. అన్నంలేక- బట్ట లేక- స్వాతంత్ర్యం లేక దేశం అంతా గగ్గోలు పెట్టి పోయారు.

ఆపరిస్థితులలో రెండవ నికోలస్ సామ్రాజ్య పీఠం

అధిష్ఠించేడు. అతడు రాజ్యానికి రాగానే మొట్టమొదట చేసిన పని ముద్రణా శాసనం బిగింపులు తగ్గించడం. పత్రికలకి ప్రోత్సాహం ఇచ్చేడు. ప్రజాభిప్రాయానికి విలవ చూపిస్తా నన్నాడు. సంస్కరణలు రాజ్యంలో ప్రవేశ పెట్టడానికి ప్రయత్నాలు సాగించేడు.

నిర్బంధాల బిగి సడలగానే ప్రజల మనస్సులలో దాగిఉన్న సంస్కరణోత్సాహం విజృంభించింది. ప్రజా హృదయాన్ని- అభిరుచిని సూచించే పత్రికలు ఊరూర బయల్దేరినాయి. 2 వ. నికోలస్ రాజ్యానికి వచ్చిన రెండేళ్ళలో "మాస్కో- పెట్రోగ్రాడ్" నగరాలలో డెబ్బై భ క్రొత్త పత్రికలు పుట్టినాయి అంటే అప్పుడు పత్రికా ప్రచారం ఎల్లా సాగిందో ఊహించవచ్చు! ప్రతీ గ్రంథ కర్తా- ప్రతిపత్రికా దేశం అంతటా నలభై ఎనిమిది లక్షలకు పైబడ్డ వ్యావసాయిక బానిసల విడుదలకై ఘోషించేరు. టాల్‌స్టాయి కూడా ఆబానిసల బాధలు తగ్గించడానికై తన కలం- కార్యదీక్షా కూడా వినియోగించేడు. తన చేతిలో ఉన్న బానిసలకి రాజశాసనం లేనిదే పూర్ణ స్వాతంత్ర్యం ఈయడానికి వీలు లేకపోయినా- వాళ్ళందరికీ రోజుకూలి- నెలజీతం, ఏర్పాటుచేసి సంస్కరణాలకి మార్గం తీసేడు.

ప్రజ లందరూ కోరుతూన్న సంస్కరణలకి వ్యతి రేకులు లేకపోలేదు. జమీందార్లంతా సంపూర్ణంగా వ్యతిరేకాభిప్రాయం చూపి సంస్కరణపద్ధతుల్ని తిర స్కరించేరు. చిరకాలంనుంచి తమ చేతిలో- తమహక్కు భుక్తాలలో ఉన్నవాళ్లని విడిచిపెట్టెయ్యాలన్న మాటే వాళ్లు సహించలేకపోయారు. వాళ్లందరికీ స్వాతంత్ర్యం ఇస్తే తమ అధికారం ఎవ్వరిమీద చూపిస్తారింక? కొట్టి నా- తిట్టినా- ఆడవాళ్లని చెరపట్టినా- నిశ్శబ్దంగా నింకె వ్వ రూరకుంటారు? జమీందార్లు తమ నిరంకుశత్వంకి అభ్యంతరం కలగచేసే సంస్కరణాలకి పూర్ణంగా ఎదురు తిరిగేరు.

కాని నికోలస్ జారు తన పట్టుదల విడిచి పెట్ట లేదు. “సంస్కరణం కావాలి” అన్న ప్రజాభిప్రాయాని కాతడు గొప్ప సానుభూతి చూపేడు. జమీందార్లని ఆలోచించి మీచేతులతో వాళ్లని విడుదల చెయ్యండని కోరేడు. కాని వాళ్ళెవరు ముందడుగు వెయ్యలేదు. చివ రకి మూడేళ్లపాటు చూసిచూసి విసిగి 1861 లో వ్యావ సాయిక దాసులకి స్వాతంత్ర్యం ఇచ్చేస్తూ శాసనం ప్రకటించేడు.

48 లక్షల ప్రజలు తరతరాలనుంచి బాధిస్తూన్న

దాస్య బంధం నుంచి విడుదలయ్యేరు. వాళ్లమీద జమీాం దార్లకున్న పలుకుబడి- అధికారం ఒక్క కాగితంతో ఎగిరి పోయినాయి. కాని అంతమాత్రం చేత వచ్చిన లాభం లేదు. ఎందుచేతనంటే ధనం- భూమీ- కూడా జమీాందార్ల చేతులలోనే వుంది. ప్రజలకి- వాళ్లకి మధ్య వున్న భేదాలు అల్లాగే ఉంటే వాళ్లుభయులూ పూర్తిగా నష్ట పడతారు. కనక టాల్‌స్టాయి వారుభయులమధ్య సామరస్యాం కుదర్చడానికి నడుం కట్టేడు.

చివర కతని ప్రయత్నాలు కొంత ఫలోన్ముఖాలై సంధి కుదర్చడానికొక యుపసంఘం నియమించ బడింది. టాల్‌స్టాయి అందులో ఒక సభ్యుడైనాడు.

కాని అతడా సంఘంలో చిరకాలం పనిచేయలేక పోయాడు. జమీాందార్లంతా ప్రజల్ని ఏవిధంగానైనా తిరిగి గోత పడత్రొయ్యడానికి ప్రయత్నాలు చేస్తూన్నారు. లియో టాల్‌స్టాయి మనస్ఫూర్తిగా ప్రజల సౌఖ్యం కోరి పని చేస్తూన్నాడు. దానితో రెండభిప్రాయాలు రెండు కక్షులు బయలుదేరినాయి. జమీాందారీ పక్షం టాల్‌స్టాయితో శత్రుత్వం వహించి, అతని మీాద లేని పోని అర్జీలు- ఫిర్యాదులూ, ప్రభుత్వంకి పంపుతూ, పత్రికలలో దుష్ప్రచారం సాగించేరు. ప్రభుత్వం కూడా

ఆతని ననుమానించ సాగింది. ఆతడు చేసే ప్రతిపని- చెప్పే ప్రతిమాట, ప్రభుత్వం చేత శ్రద్ధగా పరిశీలించ బడ సాగినాయి. టాల్‌స్టాయి కింక పనిచెయ్యడం దుర్భరం అయింది. వెంటనే ఉపసంఘంలో రాజీనామా నిచ్చి స్వగ్రామానికి తిరిగి పోయేడు.

టాల్‌స్టాయి స్వగృహం చేరుకొని తానిక చేయ వలసిన పనేమిటని ఆలోచించ నారంభిచేడు. అది నిర యించ డానికై తానిదివరకు చేసిన పనిని పర్యాలో చించ సాగేడు.

ఆతడు ఎప్పుడూ తను చేసిన పని సంపూర్ణం అయిందని అనుకోలేదు. ఉత్తమా దర్శాలకై వెతుకు లాడుతూన్న ఆతని మనస్సుకి తన జీవితంలో- తనపనుల్లో ఏదోలోపం- అసహాజం కనబడుతూనే ఉండేది.

రష్యాలో కొన్ని వందల పత్రికలూ- కొన్ని వం దల పుస్తకాలు ప్రతీనెల ప్రచురణం అవుతూన్నాయి. లక్షలకి పైబడ్డ వాటి ప్రతుల్ని లక్షలు ఖర్చుచేసి ప్రజలు కొని చదువుతూ ఉన్నారు. ఈనవలలు- నాటకాలు- పత్రికలుప్రజలింత డబ్బు పోసి ఎందుకు కొంటూన్నారు? దానినుంచి తమకేదో లాభం ఉన్నదనేనా? తమ ధనంకి తగిన ప్రతిఫలం ఆగ్రంథాలలో ఉంటుందనేనా?ఆగ్రంథా

లలో- ఆపత్రికలలో తాము వాళ్ళకి చేస్తూన్న ఉపకారం ఏమిటి?

టాల్‌స్టాయి- అనేక పత్రికలనీ- అనేకమంది కవుల్నీ విమర్శించి చూచేడు. ఆతని కెక్కడా ప్రజల బాగును కోరిన దొక్కటీ కనపడలేదు. అంతా బూటకం. ఈకవులు- ఈ కళాకారులు తమ కళ ప్రజలకి బోధించాలనే ఉద్దేశ్యంతో కాకుండా కేవలం ప్రజా సామాన్యానికంటె తమకున్న ప్రతిభనీ- గొప్పదనాన్నీ ప్రకటించుకొనడానికే వ్రాస్తూన్నారు. ఒకరు చెప్పిన విషయాన్ని వేరొకళ్ళు కాదని వాదన కొనసాగించడం, ఒకణ్ణి పొగడి, పొగడించుకొనడం; విమర్శ పేరుచెప్పి ఇష్టంలేనివాళ్ళని తిట్టడం, ఏదోవిధంగా పెద్ద పేరు సంపాదించు కొనడానికి ప్రయత్నించడం, ఇవే నేటి రచనల ఫలితం. లియో టాల్‌స్టాయి జ్ఞాన దృష్టిలో ఈకవుల- కళాకారుల జీవితాలు, సైన్యోద్యోగుల బ్రతుకుకంటేనూ- నీచంగానూ, అవినీతికరంగానూ కనపడ్డాయి.

ఈకవులంతా వ్రాసే ప్రణయ గీతాలు ప్రజోపకారం ఏంచేస్తూన్నాయి. కోకిలమీద- కుక్కలమీద పద్యాలు వ్రాయడం, గీతా లల్లడం, ప్రజలకేం ఉపకరిస్తుంది? వీళ్ళంతా వ్రాస్తూన్న ఈరచనలు కేవలం ఆత్మ

సంతృప్తికేనా? లేక ప్రజల కుపయోగించడానికా? ప్రజోపయోగంకే అయితే తమ ఉద్దేశ్యం అవి ఎంతవ రకూ నిర్వహించ గలుగుతూన్నాయి? ప్రజలయొక్క మనోవికాసానికి గాని- నైతిక వికాసానికిగాని ఏమేనా ఈ గీతాలు తోడుపడగలవా? లేక- కవుల ఆత్మ సంతృప్తి కొఱకే అంటారా? వాటిని పత్రికలలో ప్రచురించి ప్రజల ధనాన్ని- అమూల్యమైన కాలాన్ని ధ్వంసం చెయ్యడం ఎందుకు?"

ఈ విమర్శనలతో కొన్ని రోజులాతని మనస్సు ఉక్కిరి బిక్కిరి అయిపోయింది. ఆతనికి వాళ్లభిప్రాయా లెంతమాత్రం నచ్చలేదు. వెంటనే మాస్కో సాహిత్య పరిషత్తులోని తన సభ్యత్వానికి రాజీనామా నిచ్చేశాడు. తన జీవితపథం కూడా మార్చేసు కున్నాడు.

తన జీవితలక్ష్యం కూడా మార్చుకున్నాడు.పట్టణా లలో కూర్చొని పత్రికలలో వితండ వాదాలు చేస్తూ ప్రజల్ని విద్యావంతులుగా చేస్తూన్నా మనుకోవడంకంటే పల్లెటూళ్ళలలో ప్రజా సామాన్యానికి ఉత్తమ విద్య నేర్పడం సరియైన సేవ అని నిర్ణయించేడు. కాని విధానం ఏది? ప్రస్తుతం నేర్ప బడుతూన్న విధానం పనికి రాదు. అది విద్యార్థి అభిరుచినిపట్టి గాక గురువుల సౌకర్యం

కోసం నిర్మించబడింది. పిల్లల మనస్సు గ్రహించలేని తల్లి దండ్రుల సౌలభ్యం కోసం నిర్మించ బడింది. ఒక్క రష్యా లోనే ఇల్లావుందా? అన్ని దేశాలు ఒక్క మాదిరి గానే ఉన్నాయా? వాళ్ళేమైన కొత్తమార్గా లవలంబించేరా? అని ఆలోచన సాగి చేడు. ఒక్కమాటు విదేశాలు పరి శీలించి రావాలని బయలు దేరినాడు.

ఆతడు ఇంగ్లండ్— ఫ్రాన్స్- జర్మనీ- మొదలైన దేశాలన్నీ మనో వినోదం కోసం కాకుండా విద్యా విధా నం విమర్శిస్తూ సంచారం చేశాడు. కాని అతని కెక్కడా గ్రహించ దగిన ప్రణాళిక కనబడ లేదు. చివరకు ప్రాణం విసిగి జర్మనీ నుంచి ఒక పండితుని వెంట పెట్టుకొని స్వగ్రామం చేరేడు.

ఇంటికి చేరగానే ఫ్రెంచి గ్రంథకర్త - స్వాతంత్ర్య ప్రియుడు అయిన రూసో అభిప్రాయాల ననుసరించి- టాల్‌స్టాయి స్వగ్రామంలోనే ప్రజల కొరక ఆదర్శ పాఠ శాల స్థాపించేడు. అందులో తన యిచ్ఛానుసారం ఉత్త మం అని తోచిన పాఠ్యక్రమం ఏర్పరచేడు. పిల్లల్ని ఫలా నా విషయం చదవండి అని నిర్బంధించకుండా, వాళ్ల ఇష్టానుసారం- పాఠ్యాలు నిర్ణయించు కోవాలి అని విధిం చేడు. గురువులా ఉద్దేశ్యా లతిక్రమించ కుండా గట్టిగా

కట్టడి చేశాడు.

టాల్‌స్టాయి యొక్క ఈ ప్రయత్నం పూర్తిగా సాగలేదు. వివిధము లైన ఆలోచనలు- ఆతని ఆరోగ్యాన్ని చెడగొట్టినాయి. ముసలి తనంలో ఎనభై యేళ్లనాడుకూడా భ్రమించని ఆతని మనస్సు, ప్రజోపయోగకర మైన విద్యా విధానం నిర్ణయించడంలో కదలి పోయింది.

డాక్టర్లు లియో టాల్‌స్టాయిని కొంతవరకు విశ్రాంతి తీసుకోమని సలహా ఇచ్చేరు. స్నేహితు లదే ఉపదేశించేరు. వెంటనే అతడు పాఠశాల పండితుల చేతులలో పెట్టి, నడప వలసిన విధానాన్ని గూర్చి గట్టిగా నచ్చచెప్పి, తూర్పు రష్యాలో "క్రిగిజ్" ప్రాంతాలకి ఆరోగ్యం కొరకు వెళ్లిపోయాడు.

టాల్‌స్టాయి గ్రామం విడిచిపెట్టగానే అదివరకే అతనిని, అతని పనుల్ని సందేహ దృష్టితో చూస్తూన్న రష్యా ప్రభుత్వం ఆతని యింటిని శోధించింది. కాని వారెంత ప్రయత్నించినా లియో ననుమానింప దగిన పత్రాలు కాని- సాక్ష్యాలు కాని దొరక లేదు. వాళ్లు వచ్చినట్టే చేతులూపు కుంటూ పోవలసి వచ్చింది.

ఈ దాడి వలన ప్రభుత్వానికి కలిగిన లాభం లేక పోయినా ప్రజలకీ దేశంకీ కొంతనష్టం కలగక పోలేదు.

ఈ సోదాల వలన ప్రజలు భయపడి టాల్‌స్టాయి పాఠశాలకి పిల్లల్ని పంపించడానికి వెనక తీసేరు. పిల్లలు లేక పోవడంచేత పాఠశాల మూసేసి ఉపాధ్యాయులు వెళ్లిపోయారు.

లియో టాల్‌స్టాయి మిక్కిలి శ్రమపడి- ఆరోగ్యాన్నంతా చంపుకొని- ప్రజల కొరకు- పిల్లల క్షేమం కొరకు- స్థాపించిన ఆదర్శపాఠశాల ప్రారంభం లోనే మూయబడి పోయింది. కాని తరువాత తరువాత టాల్‌స్టాయి ఆదర్శాల ననుసరించే పాఠ్యగ్రంథాలు- పాఠశాలలు రష్యాలో నాలుగు మూలలా బయలు దేరినాయి.

పాఠశాల పెట్టిన తర్వాత టాల్ స్టాయి పిల్లలకై చిన్న చిన్న కథలు వ్రాసి ప్రచురించేడు. ఆకథలే ఆతని పాఠశాలలో పిల్లలకి పాఠ్యాలుగా ఉపయోగించేవి.

తరువాత అతడు "క్రిమిజ్" లో ఆరోగ్యం కొంచెము పోయినప్పుడు Power of darkness. అంటూ ఒక పుస్తకం వ్రాసి ప్రచురించేడు. కాని ప్రభుత్వం దాని నెంతోకాలం బయట నుండనీయ లేదు. ప్రచురించ బడిన కొద్దిదినాల్లోనే అది ప్రభుత్వంచేత నిషేధించబడి పోయింది.



గుతుందని వాదించేది. ఈ విధమైన అభిప్రాయ భేదాలు చాలా కలుగుతూ ఉండినా అవియేవీ వారి అనురాగానికి బంధాలు కాలేదు. అవి వారి దాంపత్య సౌఖ్యాని కడ్డు రాలేదు.

వారిరువుర నడుమనున్న అనుకూల్యం- ప్రేమ-ప్రణయాభిలాష-లియోటాల్‌స్టాయి హృదయంలో కలిగే గొప్ప గొప్ప ఆదర్శాల నిర్మించు పదిహేనేళ్ళు ముందుకునెట్టేసినాయి. ఈమధ్యకాలంలో అతడు చేసిన సాహిత్యసేవ —దేశసేవ రెండు పెద్ద పెద్ద నవలలు వ్రాయడమే. ఆనవలలే కాకుండా దేశపరిస్థితుల్ని ప్రజాహృదయంలో కలగవలసిన మార్పుల్ని సూచిస్తూ అనేక చిన్న చిన్న కథలువ్రాసి మాసపత్రికలకు పంపుతూవచ్చేడు.

ఎంతకష్టపడి వ్రాసుకొన్నా ఏపుస్తకంమీదా అతనికి పూర్తిసంతృప్తి కలిగేదికాదు.ఆవిషయంలో అసలతనికి సంతృప్తి అనేదే లేదని చెప్పవచ్చు. ఏకథవ్రాసినా ఏపుస్తకం వ్రాసినా ఏవో నూతనకల్పనల చేర్చడమో, వర్ణనలుచేర్చడమో. జరుగుతూనేవుండేది. ఏవో క్రొత్త భావాలు-వర్ణనలు-కల్పనాచమత్కారాలు అడుగడుగుకి అతనిని చుట్టు వారుకొనేవి. శుద్ధప్రతివ్రాసి అచ్చుకిచ్చిన తర్వాతకూడా ఏవోచిన్నమార్పులు చేస్తూనేవుండేవాడు.

అందువలన అతడు ప్రారంభించినప్పటి పుస్తకానికీ-అచ
పడివచ్చిన పుస్తకానికీ అసలు సంబంధమే యుండేదికాదు

లియోటాల్‌స్టాయి భార్య "సోఫియా" గ్రంథర
నలో భర్తకిచాలా సహాయంచేసేది. ఎంతో ఓర్పుతో ఎ
టికప్పుడాతని పుస్తకానికి శుద్ధప్రతులు వ్రాస్తూండే
అతడువ్రాసిన War and Peace-యుద్ధము-శాంతి అ
నవలకి శ్రీమతిటాల్‌స్టాయి ఏడుమార్లు శుద్ధప్రతు
వ్రాసింది. ఎప్పటికప్పటి కతడే వేవో క్రొత్తవిషయా
చేర్చడమో అనవసరంఅని తోచినవాటిని తీసివేయడమే
చేస్తూండేవాడు. ఒక్కమారు వ్రాసినదానినైపు వె
తిరిగి చూసేకంటే పుస్తకస్వరూపమే మారిపోయి
మళ్ళీ ఆమె శుద్ధప్రతి సిద్ధంచేస్తూనే యుండేది. ము
మీదప్రేమ-అతని రచనలమీదగల ఆసక్తి-అభిమా
"సోఫియా"కలవు సొలపులు తోచనిచ్చేదికాదు

1864 లో వ్రాయడం ప్రారంభించిన War a
peace 79 నాటికి ప్రచురణమైనది. ఈ నవల పెద్ద
దేశాలలో గొప్ప గొప్ప విమర్శకుల మన్ననల పొంది

"ఈ పుస్తకం చదువుతూవుంటే ఆపాత్రల
మరమొగ్గమెగ్గ, ఆ కథంతా మన కళ్ల యెదటే జ
గుతూన్నట్టు వివసనానికి వస్తుంది. కాని. "ఏదో చా

బాగా వ్రాసేమురా పుస్తకం" అనిపించదు" అంటూఒక ఆంగ్ల విమర్శకుడు డాగ్రింధాన్ని పొగిడేడు.

"యుద్ధం- శాంతి" తర్వాత "అన్నా కెరినీనా" అతడు వ్రాసిన నవలలలో పెద్దది. అది 1873. లో వ్రాయడం ఆరంభించి 1876. లో పూర్తి చేసేడు.

అన్నా కెరినీనా టాల్‌స్టాయి నవలలో పెద్దదీ పేరుపడ్డ దీకూడా. అది అతని నవలల్లోకల్లా అత్యుత్తమం.అన్నా కెరినీనా 1878. లో ప్రచురింప బడ్డతోడనే అనేక విదేశభాషలలోనికి పోటా పోటీలతో అనువదించబడి టాల్‌స్టాయికి విశ్వ విఖ్యాతమైన కీర్తి తెచ్చింది.

ఈ రోజులలో నాతని పెద్దయన్నగారైన నికోలస్ డిమేట్రీ క్షయ వ్యాధిచేత తీసుకొనితీసుకొని చచ్చిపోయాడు. టాల్‌స్టాయి అతని కెన్ని విధాలో సేవచేశాడు. ఆరోగ్యం కొరకనేక పరదేశాలకి తీసుకొని పోయాడు. కాని అవన్నీ నిష్ఫలములై పోయినాయి. డిమేట్రీ లోకం విడిచి పోయాడు.

హఠాత్తుగా ఒక్కమాటు ప్రణయ తరంగాలలో తేలిపోతూన్న టాల్‌స్టాయి కళ్లు అతని పెద్దయన్న 'డిమేట్రీ" మరణంతో విప్పారినాయి. పెద్దన్నమీదటాల్‌స్టాయి కపరిమితమైన ప్రేమ- భక్తి. అతని మరణం

లియో జీవితంలో గొప్ప నైరాశ్యం కలుగజేసింది.అతని మనస్సుని ఐహిక విషయాలనుంచి ఆధ్యాత్మిక విషయాల మీదకి పురిగొల్పింది. మృత్యువంటే ఏమిటి? మనుష్యుడు దానినుంచి తప్పుకోడాని కవకాశాలున్నాయా? అనే ఆలోచన కలగ జేసింది.

అన్నగారి మరణంతోనే టాల్‌స్టాయి మనుష్య జీవితంకి పరమావధి ఏమిటి? అనే పెద్దసమస్యలో పడిపోయాడు. అనుభవిస్తూన్నవి బాధలైనా, కళ్ళుమూసుకొని సుఖిస్తూన్నానను కోవడం అతని తత్వంకి సరిపడింది కాదు. సుఖం ఎందులో వుంది? జీవిత పరమావధి ఏది? అను ప్రశ్నల గూర్చి ఆలోచించడం ఆరంభించేడు.

జీవిత పరమావధి ఏది? ధనమా?

అతనికి పుస్తకాల మీద వలసినంత ఆదాయం వుంది.ప్రయత్నించికాపీరైట్‌కూడా రిజస్టరు చేయించేడా లక్షల కొలదీ కురుస్తుంది. అవికాకుండా "సమారా" జిల్లాలో ఇరవై వేల ఎకరాల భూమి అతని అధీనంలో వుంది. అతడూ పెద్ద పెద్ద జమీందార్లలో లెక్క. కాని ఈధనం జీవిత పరమావధి కాగలదా? ఇంతకు నూరు రెట్లు ధనవంతుడైతే మాత్రం మృత్యు భయాన్ని మరిపించే సుఖం కలుగుతుందా? అసంభవం! అతని దృష్టిలో

ధనంవల్ల కలిగే సంతృప్తి కంటె మరణం వల్లకలిగే భయం
అధికంగా తోచింది. కనుక నది జీవితానికి పరమావధి
కాదని నిశ్చయించినాడు.

పోనీ సంసార సుఖం- సంతానప్రేమా జీవితా
నికి పరమావధి కాగలవా? అనేక మంది గృహస్థులు
తమ సంతానం మీద ప్రాణాలు పెట్టుకొని యుంటూ
న్నారు. ఆపిల్లలకి కాస్త ఒడలు వెచ్చబడినా- జలుబు
చేసినా ఆతల్లిదండ్రులు పడేబాధా- ఆరాటం విపరీతం.
ఒకవేళ ఆ కుర్రవాడు కాస్తా కాలగతి కెరమైనాడా-

ఇక్కడ కూడా ఆతనికి మరణ భయమే అడ్డంవ
చ్చింది. మరణం వల్లకలిగే భయం ముందు ఈ సంసార
సుఖంకి కూడా చోటు లేదని ఆతడు నిశ్చయించేడు.

కాకపోతే- జీవితంకి పరమావధి కీర్తా?

కీర్తికి మృత్యు భయం లేదు. అతడీ విశాల
సాహిత్య ప్రపంచంలో అద్భుతమైన కీర్తి గడించేడు.
షేక్స్పియరు కంటేనూ- కాళిదాసు కంటేనూ, కూడా
ఎక్కువ కీర్తిపొందుతే జీవిత పరమావధి సాధించినట్లవు
తుందా? అదికూడా అసంభవమే! ప్రతీగ్రంథకర్త రచ
నలూ- భావాలూ అతని తర్వాత కూడా ఉండవచ్చును
గాని వాటిక్కూడా అంతంలేక పోలేదు. ఏ వేయేళ్లనాటి

పుస్తకం వంకేనా మనం ఇప్పుడు తొంగిచూస్తూన్నామా? మనం వ్రాస్తూన్న భాషమాత్రం నిత్యం మార్పు పొందడంలేదూ? అదీగాక మనుష్యు డనుభవించ డానికి వీలు లేని కీర్తిని పొందడం వల్ల అతనికి వచ్చేలాభం ఏమిటి? అందుచేత కీర్తి జీవిత లక్ష్యం కాదు. అని అతడు నిశ్చయం చేశాడు.

ఈ విధంగా అంతవరకూ తాను జీవితలక్ష్యాలుగా తలచిన ధనం- సంసారం- కీర్తి- జీవితానికి గమ్యాలు కావని తేలిపోగానే అతనికంత వరకూ తానుగడిపిన జీవితం మీద అసహ్యం కలిగి పోయింది. అందరూ పొగడిన తన పనులూ, గొప్పతనం తెచ్చిపెట్టిన దుష్కార్యాలూ అతని మనస్సు కింతింతనరాని బాధ కలిగించినాయి. వెంటనే లియో టాల్‌స్టాయి తన అసభ్యజీవితంవల్ల తన మనస్సుకు కలిగిన బాధనంతా My Confession అనేగ్రంథంలో యీ విధంగా వెలిబుచ్చేడు.

"ఆరోజులు జ్ఞాపకం చేసుకుంటే గుండెలు దడదడలాడి పోతాయి. నాజీవితం మీద నాకే అసహ్యం కలుగుతుంది. గుండెల్లో బాధ పుట్టుతుంది. యుద్ధంపేరు చెప్పి వందల కొలదీ హత్యలు చేశాను. చేయించేను. చంపినవాళ్లకు బహుమతు లిస్తానని పందెములు వేశాను.

జూదాలాడేను. ప్రశాంతంగా జీవించే దరిద్ర ప్రజలు సంపాదించుకొన్నదంతా తాగేశాను. ఎందరినో వాళ్లని నానాబాధలు పెట్టేను. అవినీతికరంగా మోసంచేసి బ్రతికి నాను. అబద్ధాలు- దొంగతనం- మోసం- తాగుడు- అత్యాచారం- హత్య- ఒకటేమిటి నేచెయ్యని అపరాధం లేదు. ప్రజలంతా నాయీఅవగుణాలనే చాలా ఉత్కృష్ట లక్షణాలుగా పరిగణించేరు. నాసహోద్యోగులు—నా సమకాలికులు నా నీతిమత్త్వాన్ని ముక్తకంఠంతో పొగిడేరు."

*My* Confession వ్రాసినాక లియో టాల్‌స్టాయి భావాలలో చాలా పరివర్తనం కలిగింది. జమీందారీ మీది ఆదాయం బీదవాళ్లని దోచుకోవడం అనీ— యుద్ధం చెయ్యడం- యుద్ధంకి ప్రోత్సహించడం హత్యలుగానూ పరగణించేడు. ఒకళ్లు కష్టపడి తెచ్చుకొన్నది వాళ్లనోరు కొట్టి తాను తినెయ్యడం దొంగతనం గాక మరేమిటి? లియో టాల్‌స్టాయి నన్నిటికన్న ఈ బీదల్ని దోచుకొనడమే విశేషంగా బాధించింది. అన్నం కూడా లేకుండాజేసి మాడ్చిచంపడం ప్రత్యక్షంగా హత్యలకంటె నూ భయంకరమైనదని అతడు పరితాపపడ్డాడు. తానుచేసిన ఈ మహాపాపం పోగొట్టుకొనడంకై అతడు యావజ్జీవం

ప్రయత్నిస్తూనే యున్నాడు.

లియో టాల్‌స్టాయి హృదయంలో జీవితాని
పరమావధి ఏమిటో తెలుసుకోవాలనే దుగ్గట్టిగా పట్టు
కుంది. అంతవరకూ తాను జీవితానికి లక్ష్యాలను కొన్ని
విమర్శిస్తే వట్టి బూటకాలని తేలిపోయినవి. మరి అవి
అబద్ధమైతే నిజమైనదేది?

లియో ఈసమస్య పుచ్చుకొని వైజ్ఞానికుల వెంట
బడ్డాడు. వాళ్లూ పరిణామ సూత్రాన్ని లేకరువు వేసి మను
ష్యుడెల్లా ప్రపంచం లోనికి వచ్చాడో వర్ణించడం ఆరం
భి చేరు. వాళ్లవాదంలో వూహా- అనుమానం కంటె
సత్యాం అధికంగా వుంది- కాని టాల్‌స్టాయికి కావలసిన
దది కాదు. అతని ప్రశ్న ఒకటి- వచ్చిన సమాధానం
ఒకటి.తను జీవించిన ప్రయోజనం ఏమిటంటే మనిషి ఎల్లా
పుట్టేడో ఎత్తుకొచ్చేరు వైజ్ఞానికులు.

వెంటనే ఆతడు ప్రజలకి ఆదర్శతత్త్వాలు బోధించ
డమే వృత్తిగా పెట్టుకున్న మతగురువుల దగ్గరకు వెళ్లేడు

కాని చివరకి వైజ్ఞానికులు ఎంతచెప్ప గలిగిరో
ఈ ప్రశ్నకు మతగురువులూ అంతే చెప్పగలిగేరు. టాల్
స్టాయి సమస్య మనుష్యుని మానసిక శక్తులన్నీ కేంద్రీక
రిస్తే గాని విడి వడ నిది. మతబోధకులు ప్రయత్నిస్తే

దానిని సాధిస్తారు కాని వాళ్లు కట్టుబడవలసి యుండిన 38 సూత్రాలు వాళ్లకామాత్రం స్వాతంత్ర్యం కలుగ చెయ్యవు. వాళ్ల నియమావళిలో నున్న 'జీవితం- మరణం' అనే హంశాలని గురించి మాత్రమే బోధిస్తారు కాని ఆ నియమాలు దాటి ముందుకి సాగడానికేమాత్రం అధికారం లేదు. కాళ్ళు రెండూ కట్టేసి పరుగెత్తుమన్నట్లుంటుంది వాళ్ళనానిబంధనల్లో వుండే ఆలోచించమనడం.
దీనికితోడు మతాధికార్లు ఇతరమతాలమీద చూపించే అసహ్యం- కోపం- శతృత్వం- మత సంరక్షణం పేరిట ప్రజల్ని-ప్రభువుల్ని- యుద్ధంకి ప్రోత్సహించడం- సైనికుల్ని ఆశీర్వదించి- యుద్ధంకి ప్రోత్సహించడం-టాల్‌స్టాయికి పరమాసహ్యకరంగా కనిపించేయి. అతడెంత ప్రయత్నించినా వాళ్ల అభిప్రాయాలతో ఏకీభవించ లేకపోయినాడు. ఏసుక్రీస్తు ప్రేమసందేశం వ్యాపింప చేయడానికీ పరమత దూషణం— అసహనం ఎందుకో బోధపడిందికాదు.

తనప్రశ్నకి సమాధానం రాకపోగానే టాల్‌స్టాయి ఇంక ఎవ్వరినడిగీ లాభం లేదని నిశ్చయించి ప్రపంచానుభవంచేత జీవితసత్యం గ్రహించాలని తలచేడు. మొట్టమొదట్లో అతనిదృష్టి పట్నవాసపు ప్రజ వంక తిరిగింది. పట్నాలలో ప్రజలనతడు నాలుగు విభాగాలు చేశాడు. ఒకరకం

పనువుల్లా ప్రవర్తించే పనుచుకురాళ్ళు— భోగస్త్రీలు. వాళ్ల మనస్సులీమాదిరి యుత్కృష్ట విషయాల్ని గ్రహించగలంత పక్వస్థితికి రాలేదు. కనుక వాళ్లనుంచి తాను గ్రహించగలిగే దేమీ లేదనుకున్నాడు.

ఇక రెండో రకం కఠినవిషయాల నాలోచించగ వాళ్ళైనా, ఆలోచించడానికి క్షణమైనా తీరిక లేని ప్లీడర్లు వర్తకులు— పత్రికాసంపాదకులు- రాజకీయవేత్తలు— ప్రభుత్వోద్యోగులు, మొదలైనవాళ్లంతా. అందరూ తల పనిలో అతుక్కుపోయి నిలవడానికీ— వెనుతిరిగి చూడటానికీగూడా తీరిక లేకుండా యున్నారు. వాళ్ళేదోవిధంగా జీవితం గడుపుకొనడానికే ప్రయత్నిస్తూన్నారు. కాని బ్రతుకుటచే సాధింపవలసిన ప్రయోజనం ఏమిటో గ్రహించడం లేదు.

ఇంక మూడో రకం మనుష్యులలో ఆలోచనగల వాళ్ళు లేకపోలేదు. కాని వాళ్లెవళ్లూ స్వబుద్ధినుపయోగించి జీవితలక్ష్యం ఏదని ఆలోచించలేరు. ఏపత్రికలో ఏ కవో- ఏ మతబోధకుడో- ఏ రాజో- ఏ వుద్యోగో రాజకీయవేత్తో చెప్పిన దాన్ననువదిస్తూ, తమ జీవితాన్ని ఏదేవాలయానికో— ఏదేశంకో— ఏవర్ణంకో— ఏసంఘంకో ముడిపెట్టుకొని కొట్టుమిట్టాడుతూ వుంటారు. అన్నిదేశా

ల్లోనూ సర్వసమత్త్వాన్నంగీకరించే వ్యక్తులుకూడా తమ దేశం- తమరాజు కోసం ఇతర రాజుల్తో యుద్ధచెయ్యడం తప్పుకాదనీ— అది— అంటేస్వజాతి— స్వదేశాభిమానాలు ప్రతీమనిషిలోనూ వుండవలసిన వుత్తమలక్షణం అనీ వాదించేవాళ్ళున్నారు. వీళ్ళంతాదేశభక్తి— రాజభక్తిలో జీవితరహస్యాన్ని దాచేశారు. ఆరెంటినీ దాటిపోయే జీవితరహస్యం వాళ్లు తెలిసికోరు. తెలిసికోవాలని కూడా అనుకోరు.

ఇంక నాలుగోరకం పైవాళ్లకన్న అసహ్యంగా తోచేరు. వాళ్లు మనుష్య జీవితం లోని శూన్యత్వం గ్రహించి మనుష్య జన్మ నిరర్థకంగా నిర్ధారించి "ఋణం కృత్వా ఘృతం పిబేత్త" న్న న్యాయం చేబట్టిన వాళ్లు. వీలైనంతలో మనుష్యజీవితంలో దొరక గలంత సౌఖ్యం పిండెయ్యాలనే రకం ఇది.

వీళ్లెవళ్లవలనా అతని ప్రశ్నకి సమాధానంరాలేదు. చిట్టచివరకి మిక్కిలి నిరాశ పడిపోయి- నీతి— సాహసం గల మనిషికి ప్రపంచంలో బ్రదకడాని కవకాశం లేదనే నిశ్చయానికి వచ్చేడు.

అతని దృష్టితర్వాత ప్రశాంత జీవనం నిర్వహించు కొనే పల్లెటూరి ప్రజల మీదకి పోయింది. దరిద్రులై—

అమాయకులై— పెద్ద పెద్ద పన్నులతో అణచి పెట్టబ
మారణ యంత్రాలు గానూ— దేశానికి తిండీ— గు
నిర్మించే సాధనాలుగాను,ఉన్న బీదవాళ్లకి. జీవిత రహస్య
తెలియడం మెట్లాగ? వాళ్లాత్మ హత్యకెప్పుడూ తలపెట్ట
బ్రదికి యున్నంతకాలం కష్టాలూ— సుఖాలూ— ధైర్యం
సహిస్తారు. ప్రశాంతమైన మనస్సుతో మరణాన్ని ఎ
ర్కొంటూరు. ప్రపంచానికంతకు ముఖ్యంగా కావలసి
తిండీ— గుడ్డా— వుత్పత్తి చేసే ఈ అమాయకపు ప్రజ
జీవితంలోనే మతబోధకుల యొక్కా— వైజ్ఞానికు
యొక్కా— జీవితాలలో లేనిసత్యం— శాంతి యిమి
యున్న ట్లాతనికి తోచింది

లియో టాల్‌స్టాయి వాళ్ళలో తెలివైనవాళ్ళతో
మాట్లాడిచూసేడు. వాళ్లుతమ అభిప్రాయాలు పై
స్పష్టం చేయలేకపోయినా- వాళ్ల హృదయాలూ— జీ
తం కూడ సత్యానికి సమీపంలోనున్నట్లు గ్రహించే

వారాతని ప్రశ్నకి సమాధానంగా "భగవత్సే
పరోపకారం" అన్న రెండు విషయాలు సూచించేరు
ఆమాటల్లో కొంతవరకు సత్యం లేకపోలేదని అతని
తోచిందు.

పరోపకారం—అదే జీవితానికి పరమావధి.అం

లోనే సుఖం వుంది. శాంతివుంది. గ్రామీణుల జీవితా లలో ఆ రెండూ ప్రతిఫలించడానికి పరోపకారమే కారణం. టాల్‌స్టాయికీసమాధానంతో కొంత సంతృప్తి కలిగింది. కాని ఆబీదలుచెప్పిన భగవంతుడెవ్వరు? అతడున్నదీ— లేనిదీ— తెలిసికొనే వుపాయం ఏది? అతనిని తెలసికోవలసిన అవసరం ఏమిటి? ఈ ప్రశ్నలతో టాల్‌స్టాయికి గుక్క తిరగ లేదు.



## ౭

చివరకు కొందరు స్నేహితులు దేవుడంటే ఎవరో- మనుష్య జీవితానికీ దానికీ యున్న సంబంధం ఏమిటో తెలుసు కోవాలి అంటే ప్రాచ్యదేశపు మతగ్రంథాలు చదవ మని సలహా ఇచ్చేరు. వెంటనే అతడు మిగుల శ్రద్ధతో బౌద్ధమతము- కన్ఫ్యూషియస్ మతము- మహమ్మదీయ మతమును గురించి తెలుసు కొనడాని కానూ మతగ్రంథాలు చదవడం ఆరంభించేడు. ఆ పుస్తకాలలో ఆతని నన్నింటికంటె అధికంగా ఆకర్షించిన విషయం మత ప్రవక్తల జీవితాలలో స్పష్టరూపంలో ప్రతి ఫలిస్తూన్న సేవా వ్రతం.

జీవన- మరణాల సమస్యల్ని గురించీ- ప్రపంచాన్ని నడిపిస్తూందను కుంటూన్న ఆ యప్రత్యక్ష శక్తితో ఈ ప్రపంచాని కున్న సంబంధాన్ని గురించీ ప్రాచ్య పాశ్చాత్య మత గ్రంథాలన్నింటి లోనూ సమంగానే చర్చించ బడినట్లు తెలుసుకొన్నా డతడు.ఆ యప్రత్యక్ష శక్తికి ప్రపంచంతోగల సంబంధాన్ని ఏ హేతు వాదాలు నిరూపించ లేకపోవడం అతడు స్పష్టంగా గ్రహించ గలిగేడు. కాని ఆసత్యం నిరూపించబడే ప్రయత్నంలో వాటి

నుంచి వేరుచెయ్యడానికి కూడా వీలులేనంత జటిలంగా అబద్ధాలూ - మూఢ విశ్వాసాలూ - నమ్మజాలని కథలూ అల్లివేయ బడ్డాయి.

అతడా మతగ్రంథాలన్నీ వాక్యవాక్యం విమర్శగా చదివి, వాటిలో స్పష్టంగా - సుబోధకంగా - మనుష్య జీవితానుభవాల కన్నివిధాలా సరిపడి, హేతువాదం కనురూపకంగా వున్న సత్యాంశాలు గుర్తులు పెట్టుకుంటూ పూర్తి చేశాడు. ఆ విధంగా ఒక్క మాటు చదవడం కాకుండా ఎన్నోమార్లు చదివి సత్యాంశాలన్నీ క్రోడీకరించేడు.

కాని అప్పటికీ ఆ గ్రంథాలలో చాలాభాగం అబోధంగానే ఉండిపోయింది. ఆ మిగిలి పోయిన భాగాలన్నీ అనేక విధాలైన మూఢవిశ్వాసాల తోనూ - అపభ్రంశపు కథల తోనూ నిండిఉన్నాయి. క్రీస్తు నీటిమీద నడవడం - మహాత్ముడు ప్రేతం నిరాధారంగా ఆకాశంలో నిలవ బడడం - శుద్ధోదనుని భార్య గర్భంలో జ్యోతిస్వరూపం ప్రవేశించడం - మొదలైన తెలియని సంగతులతో నిండియున్న ఆ భాగాలాతని సత్యాన్వేషణ కభ్యంతరాలు కాలేదు.

మతగ్రంథాలన్నీ ఏకీభవించిన అయిదు విషయాలు

టాల్‌స్టాయి వరి వాటిని గూర్చి పూర్తిగా విమర్శించేడు. వాటిలో మొదటిది "కోపాన్ని చంపుకోవాలి" అన్నది.

చాలామంది ప్రజలు కోపం చంపుకోవడం ఎందుకని అడుగుతూంటారు. ఏపరిస్థితుల్లోనూ కోపం మనిషికి సాయం చెయ్యడానికి బదులు ఎక్కువ పని కల్పిస్తుంది. అది ప్రతీ మనిషికీ నిత్యం ప్రత్యక్ష మయిన అనుభవం.

రెండోది "కాముకుడు కాకూడదు" అన్నది. కామంవల్ల ప్రతీ వ్యక్తికీ- ప్రతీసమాజంకీ కలుగుతూన్న నష్టకష్టాలు ప్రతీమనిషీ ఎరుగును. సమాజంలో జరిగే దుష్కృత్యాలకి మూడువంతులు కామమే కారణం. కాని కామం అన్నది జీవసహజం. ప్రకృతి నతిక్రమించడం ఎవ్వనికీ అసంభవమే కనక ప్రతీమనిషీ ఎంత తక్కువతో తృప్తి పడితే అంత ఉత్తమం కామం విషయంలో-

మూడోది- ఏ విషయాన్ని గురించీ మాట ఇవ్వక పోవడం-

మనం ఏప్రభువుకో-ఏవ్యక్తికో మాట ఇస్తామనుకోండి. ఆ చేసిన ప్రతిజ్ఞ తాత్కాలికంగా బాధకరం కాకపోవచ్చు .కాని తర్వాత తర్వాత ఆ వ్యక్తి మన ప్రతిజ్ఞ జ్ఞాపకం చేస్తూ మనకిష్టం లేని పనులు పురమాయించవచ్చు. అప్పుడేం చెయ్యాలి? మన ప్రతిజ్ఞల నతి

క్షమించడమా? లేకపోతే మనకిష్టం లేకపోయినా మన అయిష్టాన్ని చంపుకొని ఆపనికి ఒడి కట్టవలసిందేనా? ఇల్లాంటి ద్వైవిధ్యంతో ముందు ముందు బాధ పడేకంటే మొదట్లో మాట ఇవ్వకుండటం ఉత్తమం కాదూ?

నాలుగోది- అపకారి కూడా అపకారం చెయ్యకూడదు. ఐదోది-శత్రువును కూడా ప్రేమించడం నేర్చుకోవాలి.

వాస్తవంకీ రెండింటి అభిప్రాయం ఒక్కటేయైనా వీటిలో మొదటి దానికన్న రెండవ దాంట్లో ఆధిక్యం స్పష్టం. మొదటిది శాంతాన్ని బోధిస్తుంది. రెండోది ఆ శాంతానికి మెఱుగు పెట్టే ప్రేమని బోధిస్తుంది.

ప్రపంచంలో హెచ్చు తగ్గులు లేవు. ప్రతి జంతువులో- ప్రతి మనుష్యునిలో ప్రతీ వస్తువులో ప్రకటితం అగుతూన్న శక్తి ఒక్కటే. ఒకళ్లకి బాధకర మయ్యేపని అందరికీ బాధకరంగానే వుంటుంది. అందుచేతనే-

కం॥ ఒరులేయవి యొనరించిన ।
నరవర!యప్రియంబు తన మ-నంబునకగుదా।
నొరులకు నవిసేయకునికి ।
పరాయణము పరమధర్మ-పథముల కెల్లన్॥

[ఆంధ్రమహా భారతం]

అన్నధర్మ సూక్ష్మం మరచి పోకూడదు.

లియో టాల్‌స్టాయి– క్రైస్తవ– బౌద్ధ-కన్ఫ్యూషియన్-మహమ్మదీయ మతగ్రంథాల నుంచి గ్రహించిన యీ సత్య ధర్మాల్ని గురించి సంపూర్ణ వివరంతో The four Gospels hormonised and translated అనే పుస్తకం వ్రాసి 1882 లో ప్రకటించేడు.

సామాన్యంగా వేదాంతు లందరిలాగా చిలక పలుకులు పలుకుతూ శుష్క ప్రియాలతో కాలక్షేపం చెయ్యక టాల్‌స్టాయి తాను గ్రహించిన సత్య విషయాలాచరణలో పెట్టసాగేడు.

ఒకళ్లకుపకారం చెయ్యడమే జీవిత పరమావధియై నప్పుడు మనకవసరంలేనంత ఆస్తి పోగేసుక్కూర్చోడం తప్పు.

అనేకమంది ప్రజలన్నం లేక మాడిపోతూంటే మనం మృష్టాన్నాలు తినడం నీచమైనపని. అంతకంటే శరీరారోగ్యం రక్షించగల సాధారణ భోజనం చెయ్యడం ఉత్తమం.

మంచివిలువైన బట్టలుకట్టుకొని సామాన్యప్రజలకంటె భిన్నంగాఉండడంకంటె, వేషభాషలలో సోదరప్రజలతో కలసిఉండడం అవసరం.

శ్రమలేనిదీ- ఆదాయం అధికంగా ఉన్నదీ- పని
మనం తీసుకొని- అసహ్యం బాధ కలిగించే పనుల్ని దరి
ద్రులు- దుర్బలులు- దురదృష్టవంతులు- స్వార్థత్యాగులు
అయినవాళ్ల పరం చెయ్యడం కంటె అన్యాయం వేరొకటి
లేదు. ప్రతీపని ఉచ్చ- నీచ భేదం లేకుండా సోదర ప్రజ
లతో సమంగా మనం కూడా చేసితీరాలి.

ఈ విధంగా తానింక చేయవలసిన విధానం నిర్ణ
యించుకోగానే లియో టాల్‌స్టాయి తన అభిప్రాయా
లాచరణలో పెట్టేశాడు.

భోజనవిధానం పూర్తిగా మార్చేశాడు. అధికంగా
ఖర్చయే మాంసభోజనం విడిచిపెట్టేసి అతిచౌకలో
సమకూడే శాకాహారం ఆరంభించేడు. సారా- పొగాకు
మొదలైన మత్తువస్తువులు వదిలేశాడు. వేషం కూడా
మార్చేసి సాధారణమైన బట్టలు కట్టుకోవడం ఆరంభించేడు.
గృహకృత్యాలలో భార్యకి తోడుపడేవాడు. నీళ్లు తీసుకురా
వడం, పుల్లలు కొట్టడం మొదలైన బరువుపనులన్నీ ఒళ్లు
వంచి చేసేవాడు. చెప్పులు కుట్టడం నేర్చుకొని తనకు కావ
లసిన జోళ్లు తానే తయారు చేసుకొనేవాడు. పల్లెల ప్రజ
లతోనూ- వ్యవసాయికులతోనూ- కలసిమెలసి యుం
డడానికుత్సహించేవాడు. పల్లెటూరి ప్రజలమాదిరిగా

ఒక సంచిభుజాన వేసుకొని దానిలో ప్రజలకిముఖ్యంగా అవసరపడే సామానుతీసుకొని కాలినడకను దేశంలో సంచారం చేస్తూ బీదలలో పంచిపెట్టుతూండేవాడు.

ఈ విధంగా శరీర కష్టం చేస్తూన్నా అతడు వెనకటికంటె అధికంగా సాహిత్య సేవ చేయగలిగేడు. అతని జీవితలక్ష్యం మారగానే అతని రచనల ఉద్దేశ్యాలు కూడా మారిపోయి నాయి. అతని రచనలిప్పుడు కేవలం మనోవినోదంకోసం వ్రాయ బడటం లేదు. మనుష్య జాతికి జీవిత పరమావధి— సత్యధర్మాలూ తెలియపరస్తూ వాళ్ల జీవితంలో సుఖం-శాంతి కలగ జేయడం వాటి ఉద్దేశ్యం. ఆ ఉత్సాహంలో ఆతడనేక చిన్న కథలు- నవలలు- నాటకాలు— వ్యాసాలు— ఉత్తరాలు ప్రచురించి ప్రజలకాదర్శ జీవనం అనుభవానికి తీసుకు రావడానికి ప్రయత్నించ సాగేడు.

లియో టాల్‌స్టాయి జీవితంలో ఈ పరివర్తనం నడుస్తూన్న రోజులలోనే రష్యా రాజకీయరంగంలో గొప్ప మార్పు కలిగింది. కొన్నేళ్లనుంచి ప్రజలకీ- జమీందార్లకీ నడుమ రేగుతూన్న ద్వేష జ్వాలలు తీవ్రరూపం ధరించినాయి. ఆ ద్వేషంకి ఫలితంగా సంస్కరణాలు తీసుకు రావడానికి ప్రయత్నించిన రెండవ నికోలస్

1881 వ సంవత్సరం మార్చి 13 వ తేదీని హత్యాకారుల చేతులలో పడి పోయాడు.

ఆతని వెనుకనే సింహాసనం ఎక్కిన మూడవ నికోలస్ జార్ వెంటనేదేశంలోనిర్బంధశాసనాలు ప్రకటించి, ఆ హత్యతో సంబంధం ఉంటుందని అనుమానం కలవారి నల్లా జైలులో పెట్టేశాడు. సైనిక న్యాయ స్థానాలలో వెంటనే విచారణ జరిపించేసి హత్యతో సంబధం ఉన్న వాళ్లందరికీ నిర్దయగా ఉరిశిక్షలు వేసి-హత్యా కారులతో సంబంధం ఉన్నవాళ్లకి దేశాంతరవాస శిక్షలు— యావజ్జీవ నిర్బంధ శిక్షలూ విధించేడు. నికోలస్ తీసుకొన్న ఈ తీవ్రచర్యలకి- అదివరకు జమీందారీ కక్షవారి దుర్ణయానికీ— క్రౌర్యానికీ గగ్గోలు పడిపోయిన ప్రజలంతా సంతోషించేరు,కాని టాల్‌స్టాయి అభిప్రాయం ప్రజాభిప్రాయానికీ— ప్రభుత్వ నిర్ణయానికీ కూడా కేవలం వ్యతిరేకం. "కన్నుకి కన్ను— పన్నుకి పన్ను" అనే ఈ నీతి మానవత్వానికి లక్ష్యం కాదని ఆతని దృఢ నిశ్చయం. కావున శిక్షలు విధించ బడిన వెంటనే లియో టాల్‌స్టాయి ఆ శిక్షల వలన తనకు గలిగిన హృదయ వేదననంతా తెలియ పరస్తూ మూడవ నికోలస్ కొక పెద్ద జాబు వ్రాసేడు.

మొదటి నికోలస్ నిర్దయ శాసనం ప్రజలకి సంతృప్తి చెయ్యలేక పోయింది. రెండవ నికోలస్ జార్ యొక్క నిర్బంధంతో కూడిన ఉదార సంస్కారాభిప్రాయాలు కూడా ప్రజల నందరినీ సంతుష్టి పరచలేక పోయినాయి. ఆరెండుమార్గాలూ విఫలం అయిపోయి నప్పుడు మళ్లీ ఆమార్గమే అవలంబించి ఆతప్పేచేయడం ఎందుకు? "అక్రోధేనజయేత్ క్రోధం" అనేనీతి నిప్పుడవలంబించి యీహంతకుల్ని క్షమించి విడిచివేస్తే వాళ్ళు చేసినపనికి వాళ్లేసిగ్గుపడి సన్మార్గం గ్రహించగలరని టాల్‌స్టాయికి దృఢమైన సమ్మకం. ఆఅభిప్రాయాల్నే వివరిస్తూ టాల్‌స్టాయి రష్యాచక్రవర్తికి లేఖవ్రాసినాడు. కాని ప్రభుత్వం ఆతనికెట్టి సమాధానం ఇవ్వలేదు. శిక్షలవిషయంలో అభిప్రాయం మార్చుకోలేదు.

హంతకు లురిదీయబడ్డారు నిర్ణీతకాలంలో. వారి అనుయాయులు పెద్దపెద్ద శిక్షలతో నేలని రాసెయ్యబడ్డారు.

లియోటాల్‌స్టాయి మనస్సుకు న్యాయంపేరున జరిగిన ఈహత్యలు చాలాబాధ కలుగచేసినాయి. ప్రాణంకి ప్రాణం తీయాలనే నీతియొక్క నగ్నస్వరూపాన్ని బ్రతికిఉన్నంతకాలం, వ్రాసిన ప్రతీపుస్తకంలో-

చెప్పినప్రతీమాటలో వ్యక్తంచేస్తూనే ఉండేవాడు. మను
ష్యుడుచేసే దుష్కృత్యాలలో దీనిని మించినది లేదని
టాల్‌స్టాయి అభిప్రాయం.



౮

ఆపడాది లియో టాల్‌స్టాయి మాస్కో నగరంలో కొద్దిరోజులు గడపడానికి వెళ్ళేడు. అచ్చటి ప్రజల్నీ— వారిస్థితిగతుల్నీ జాగ్రత్తగా చూసేటప్పటికాతని గుండె నీరైపోయింది. పూర్వంకూడా అతడు మాస్కో చూసేడు. కాని నాడుకలగనిబాధ- ఆవేదన నేడెందుచేతనో ఆతని హృదయంలో కలిగినాయి. పల్లెటూళ్ళకంటె సౌఖ్యకరాలనుకున్న పట్టణాల్లోకూడా- బాధపడే ప్రజలున్నారని ఆతనికి తెలియగానే మనస్సు చివుక్కుమంది.

దానిక్కారణం మాస్కో నగరంలోని మార్పు కాదు. మాస్కో అన్ని పట్టణాలలాగే —ఎప్పుడూ వున్నట్లేవుంది. కాని టాల్‌స్టాయి భావాలలో నాటికీ- నేటికీ చాలా భేదం ఉంది. ఆ భావాలతో ఆతని దృష్టి కూడా మారింది. వెనుక బీదవాళ్ళ మీద జాలి పడేవాడు కాని ఆజాలి జాలి కాదు. వారి దారిద్ర్యం మీద సానుభూతి అది. కాని నేడాతని ప్రతీ రోమకూపం— బీదవాళ్ళు తనబోటి ధనికులచేత మోసగించబడి బాధపడుతున్నారనే విచారంతో దగ్ధమై పోతూంది. దివ్యభవనాలలో- దివ్యభోగా లనుభవిస్తూన్న ప్రజల పక్కా

కొంపమీద ఎండ తగులకుండా ఆకు లేనా లేక- తిండికీ-
బట్టకీ కరువై- చిక్కి శల్యాలైయున్న ప్రజల్ని చూడ
గానే జరుగుతూన్న మోసం- దొంగతనం కళ్ళ ఎదుట
కట్టినట్లై ఆతని హృదయానికి బాధ కలిగిస్తూంది. ఇప్పు
డాతని దృష్టిలో శాఖాభేదాలు- మతభేదాలు- దేశభే
దాలు- ప్రజలలో విభేదం కలగ చెయ్యడం లేదు. ఆతని
అభిప్రాయంలో ప్రజలంతా రెండేరకాలుగా ఉన్నారు.
ఒకరకం కూలీలు. వాళ్ళ జీవితంలోని ప్రతిఘడియూ
నిర్జీవయంత్రాల మాదిరిగా చెమటూర్చి పనిచేస్తారు.
యజమానుల పెట్టేబాధలు- తిట్లు-దెబ్బలు- సహించి-
మనుష్యుడికి కావశ్యమైన వస్తువులన్నీ ఉత్పత్తి చేస్తారు.
కాని రక్తం ఓర్చి పనిచేసినావాళ్ళ కన్నం లేదు. రాత్రిం
బగళ్ళు చాకిరీ చేసినా ఒంటినిండా బట్ట లేదు. ఇల్లు లేదు.
వాకిలి లేదు. ప్రపంచానికంతకీ ఉపకరిస్తూన్న ఈ సజీవ
యంత్రాలకేసి చూసేవాళ్లుగాని- వాళ్ల లోపాలు భర్తీ
చేసేవాళ్ళుగాని లేరు.

ఇక రెండోరకం కూలీల సంపాదనంతా పీల్చి
బ్రతికే బదనికలు. వాళ్లరక్తంతో బ్రదికే నల్లిజాతి మను
ష్యులు. వాళ్లు పనిచెయ్యడం ఏనాడూ ఎరక్కపోయినా
మృష్టాన్నంకి లోపంలేదు. నివాసం ఇనపపెట్టెలవంటి

గట్టియిళ్లల్లో. కాళ్లు మెత్తని తివాసీల మీదగాని ఉంచ రా ఆగర్భ శ్రీమంతులు. వట్టిపోమరిపోతులు. ఆబీదవాళ్లు తెచ్చిఇచ్చే దానినంతా— జూదాలకి— త్రాగుడికి- లంజ లకివెచ్చపెట్టేసి— ఇంకా తెమ్మని బీదల పీకలమీద కూర్చుంటారు. బీదల్ని కొట్టడం- తిట్టడం— జన్మతః తమ బోటి వాళ్లకి కలిగిన హక్కని తలచే రకం కాని తమరు చేస్తూన్న మోసం వాళ్లకి తెలియక పోలేదు. ఎప్పుడో తమ మోసం ప్రజలకి తెలియక పోదని, నాటి కాపుద లకై దేవుడు—స్వర్గం- అదృష్టం అనే అదృశ్యములైన డాళ్లు చాటు చేసుకొని ప్రజల్ని మోసగించి ఆత్మరక్షణ చేసు కుంటూన్నారు.

ధనవంతులు చేసే అత్యాచారాలని— వాటివల్ల బాధలు పడుతూన్న ప్రజల్ని చూచి టాల్‌స్టాయి చాలా వ్యధ చెందేడు. బీదవాళ్ల స్థితిగతులు వివరంగా తెలుసుకో వాలని కోరేడు. వాళ్లతో నిత్యం మాటలాడ సాగేడు. వాళ్లు నివసించే వీధుల్లో తిరుగుతూ వాళ్ల పరిస్థితులు కని పెట్టుతూ వచ్చేడు.

సరిగ్గా అసమయంలో మాస్కో నగరంలో జనా భాలెక్కలుతీసుకొనేటందు కేర్పాట్లు జరుగుతూన్నాయి. బీదవాళ్లున్న భాగాలలో లెక్కలు తీసుకొనే అవకాశం

పొందుతే తన పని చాల సులభం కాగలదని టాల్‌స్టాయి నిశ్చయం చేసుకొని ప్రభుత్వానికి ప్రార్థనా పత్రం పంపేడు.

లియో టాల్‌స్టాయి మాస్కోలో బీదవాళ్లుండే భాగంలో జనాభా తీసుకొనే ఉద్యోగిగా ప్రభుత్వంచేత నియమించ బడ్డాడు. ఆతడు తనపని అత్యుత్సాహంతో- పూనికతో నిర్వహించ సాగేడు. ప్రతీగల్లీ-ప్రతీ ఇల్లూ తిరిగి తిరిగి ప్రజల స్థితి గతులు పరిశీలించి వాళ్లు పడే అవస్థల స్పష్టంగా తెలుసు కున్నాడు.

ఐశ్వర్యం- ఆనందం- సుఖం- ఓలలాడుతూన్న రాజభవనాల నీడలలో దారిద్ర్యం—దుఃఖం- బాధ తాండవించి పోతూన్నాయి. అక్కడి ప్రజలు తిండికి లేక ఆకలికి నకనకలాడి పోతూన్నారు. రోగాలకి కృశించి పోతూన్నారు. బాధలకి తల్లడిల్లి పోతూన్నారు. వాళ్ల ఆకలి చల్లార్చేటందుకు ధనవంతులు ప్రయత్నం చేయరు. రోగాలకి విరుగుడు లాలోచించరు. బాధలు తగ్గించడానికి బదులు క్షణం క్షణం వాళ్లని నొక్కి వేయడానికే ప్రయత్నిస్తూంటారు.

దీనికంతకీ మూలకందంపది? సోదర మానవుడు తిండిలేక- రోగాలచేత కృశించి పోతూంటే ప్రక్క-వాళ్లు

మానవత్వాన్ని చంపుకొని చూస్తూ ఊరకుండటానికి అవకాశం కల్పించిందేది? దరిద్రులు తమలో తాము సహాయం చేసుకుంటారు. బాధలలో పరస్పరం సానుభూతి చూపించుకుంటారు. కాని ధనికుడా ప్రాంతాలకే తొంగి చూడడు. తనదగ్గర చాకిరీ చేస్తూన్న సేవకుడు మాడి పోతూన్నా ధనికుడు సంబంధం పెట్టుకోడు. రోగం వచ్చి పడిపోయినా నాగాలు మానడు. సేవకుల ఆత్మ గౌరవం పొగరుబోతుతనంగా నిర్ణయిస్తాడు. ఈవిధంగా దరిద్రుని లక్షణాలతో-మానసిక వ్యవస్థలతో- పూర్ణంగా వ్యతిరేకించే ధనికుడి దేహనిర్మాణానికీ– దరిద్రుని దేహనిర్మాణానికీ తేడా ఉందా? —— లేదు! కాని జ్ఞానేంద్రియాలు సమానంగా పని చేయక పోవడానికీ- అభిరుచులు- అభిప్రాయాలు– పూర్ణంగా భేదించడానికి కారణం ఏమిటి?

లియో టాల్‌స్టాయి మనుష్యుల భావాలలో కలిగే హెచ్చు తగ్గులకి కారణం ధనం అని నిశ్చయించేడు.

సమాజంలో జరుగుతూన్న దురంతాలకీ- మనుష్యులలో వ్యాపిస్తూన్న దుర్గుణాలకీ కారణం ఒక్కటే! అదేధనం. అదిమినహాయిస్తే ప్రపంచం అంతా ఒక్కటే. అందరి అభిరుచులు– అభిప్రాయాలు ఒక్కటే. ధనం

అనేది మనుష్యుని సద్గుణాల నణచి పెట్టేటందుకు మంచి యుపాయం.ధనం కనబడేటప్పటికి స్నేహం- బాంధవ్యం- మంచితనం- ఉదారాశయాలు- సర్వం వెనక పడతాయి. ధనం మనుష్యుణ్ణి పశువు కంటేనూ నీచతరంగా తయారు చేస్తుంది.

మాస్కో నగరంలో ప్రత్యక్షమైన అనుభవాలాతని మనస్సుమీద బాగా అంకితాలై పోయినాయి. వాళ్ల బాధలు చూడటం చేత కలిగిన పరితాపం అంతా అక్షరరూపం లోకి తెచ్చి 1885 లో What to do? అనే పుస్తకం వ్రాసి ప్రచురించేడు. ఇందులో దరిద్రుల అవస్థలన్నీ కళ్లకు కట్టినట్లు వర్ణించి- వర్ణించి, ధనం— దాని కంటేనూ సమాజ నిబంధనలు ప్రపంచాని కత్యంతం అపకారం చేస్తూన్నట్లు నిర్ణయించేడు. ధనం కారణంగా ఏర్పడ్డ సమాజ నిబంధనలు- ధనం కంటేనూ అధిక బాధకరంగా పరిణమిస్తూన్నాయని తేల్చేడు.ఆ సమాజ నిబంధనలు మారితే గాని ప్రపంచం బాగుపడటాని కవకాశం లేదన్నాడు. బీదవాళ్ల నుద్ధరించడాని కేమనిషి ఎంతెంత డబ్బిచ్చినా వినియోగం లేదు. ప్రపంచంలో ఉన్న బంగారం అంతా పంచిపెట్టినా సమాజ నిబంధనలు మారకపోతే ఉపయోగం లేదన్నాడు. బీదలు పడుతూన్న

కష్టాలు- బాధలకీ కారణం కార్యభారం జనులందరికి సమానంగా వినిమయం చేయక పోవడమే! ప్రస్తుతం ఉన్న సమాజనిబంధనలు— ధనం తేలికైనపనీ ఒకమూల—దారిద్ర్యం కార్యభారం వేరొక మూలఉంచి ప్రజల్ని మోసగిస్తూన్నాయి. కనక ఈ పరిస్థితులలో ప్రజలు చేయవలసిం దొక్కటే.

"మనం అంతా గతంకి పశ్చాత్తాపం పొందాలి హృదయ పూర్వకంగా. బీదవాళ్ళకి మన ఖజానాలోనుంచి ఒక్కపైగాని వ్యయం చేయక పోయినా వాళ్ళ భుజాల మీదున్న కార్యభారం కొంత మనం కూడా తీసుకోవడం అవసరం. వాళ్ళకష్టాలలో పాలు తీసుకోవడం ముఖ్యం."

అని టాల్‌స్టాయి తనగ్రంథం చివర మనుష్యకర్తవ్యం నిర్దేశించేడు. వెంటనే తానా విధంగాచెయ్యడం మొదలు పెట్టేడు.

ఈ మధ్య కాలంలో కూడా టాల్‌స్టాయి మత గ్రంథాలు తిరిగి తిరిగి విమర్శిస్తూనే యున్నాడు. ఎప్పటికప్పుడు తన అభిప్రాయాలన్నీ పుస్తక రూపంలో ప్రపంచానికి ప్రదర్శిస్తూనే ఉన్నాడు.

1883 లో The Gospel in brief- క్లుప్తంగా

మతాన్ని గూర్చి” అనే పుస్తకం వ్రాసేడు. 1884 లో My Religion లేక What I belive- నా మతం. అనే పుస్తకం, The Christian teaching- క్రైస్తవ బోధ- అనే పుస్తకం ప్రచురించ బడ్డాయి. వీటిలో “క్రైస్తవ బోధ” అపూర్ణంగానే ప్రచురింప బడింది. టాల్‌స్టాయి తర్వాత దానిని పూర్తి చేయడాని కొకటి రెండుమార్లు ప్రయత్నించేడు గాని ఇతర గ్రంథాలు వ్రాయవలసిన తొందరలో దానిని ముగించలేక పోయాడు.

ఈపుస్తకాలన్నిటిలో అతడు తెలిపిన ప్రధానా భిప్రాయాలొక్కటే కాని ఒక్కొక్క పుస్తకంలో ఒక్కొక్క విషయానికి ప్రాధాన్యం ఇచ్చేడు.

తరువాత 1885 లో What to do? ఏంచెయ్యా లనే పుస్తకం ప్రకటించ బడింది. అందులో అతడు ప్రేమా సత్యా— గ్రహం. ప్రతీకారం అశాశ్వతం అనే అభి ప్రాయానికి ప్రాధాన్యం ఇచ్చేడు. “ప్రతి మనుష్యుని లోనూ పశుత్వం మానవత్వం- ఒక దానితో ఒకటి ఒరసి ఉంటాయి. దానిలో పశుత్వం మనుష్యుని ఇం ద్రియాలకి తాత్కాలిక సుఖం సంతృప్తి చూపించి చులాగ్గా లొంగతీసు కుంటుంది. కాని మనుష్యుని జీవిత ధ్యేయం పశుత్వంతో పరిసమాప్తం పొందేది కాదు

మన జీవితాన్ని దుష్టమార్గాన్నుంచి- పశుమార్గాన్నుంచి మానవత్వంలోకి పరిణతి కలుగచేసు కొనడమే పునర్జన్మ అంటే. మనకళ్లకి ధృవ సత్యాలుగా కనిపిస్తూన్న వన్నీ విమర్శించిన మీద నాశంపొందేవే అని గ్రహించగలం. వాటినే నమ్మితే మనం తప్పకుండా మోసగించ బడ్డట్టే. మన దృష్టికోణాన్ని నశ్వర సుఖం మీద నుంచి శాశ్వత మైన వస్తువుమీదికి మార్చుకోవాలి. ఈ ప్రపంచంలో మనంఅంతా శాశ్వతం- సుఖదాయకం అనుకుంటూన్న ప్రతీకార వాంఛ నశ్వరం. అది మనుష్యునిలోని పశు త్వానికి నిదర్శనం. ప్రేమ ఒక్కటే శాశ్వతం. అదే మానవునిలోని మానవత్వానికి నిదర్శనం.

టాల్‌స్టాయి జీవితాంతం దాకా తాను నమ్మిన ఈ సత్యాన్నే అనుసరించి ప్రపంచానికి మార్గదర్శియై నాడు.

తరువాత నతడు 1887 లో On life- జీవితం మీద—అనే గ్రంథం వ్రాసి ప్రచురించేడు

1889 లో ప్రపంచాని కంతకీ టాల్‌స్టాయి భావాల మీద విపరీతాభిప్రాయాలు కలగ చేసిన క్రూడ్జర్ సొనాటా— Kreutzer Sonata- ప్రచురించ బడింది. దాంపత్య ధర్మాలనీ- స్త్రీ పురుష సంబంధాన్నీ

గురించి వ్రాయబడిన ఆగ్రంథం విద్వత్ప్రపంచంలో చాలా
గందరగోళం కలిగించింది. అతడు తనకావిషయంమీదగల
అభిప్రాయాలన్నీ—అసూయ చేత భార్యను చంపేసిన ఒక
వ్యక్తి నోట పలికించడంలో కలిగిన మెత్తదనం- అతని
అభిప్రాయాలకిపూర్ణంగా మారుద్దేశ్యం కలిగించింది. విద్వ
ల్లోకంలో తన అభిప్రాయాలకి విపరీత వ్యాఖ్యలు బయలు
దేరగానే టాల్‌స్టాయి తానా పుస్తకం వ్రాయడంలో
గల ఉద్దేశ్యం వివరిస్తూ "పశ్చాత్క-థనం" అనే వ్యాసం
వ్రాసి ప్రచురించేడు. "క్రూట్జర్ సొనాటా" ఆ "పశ్చా
త్కథనం"తో కలిపి చదువుతేనే సరిగ్గా బోధపడుతుంది.
లేకపోతే స్త్రీపురుష సంబంధాన్ని గురించిన టాల్‌స్టాయి
భావాలు అగోచరంగానే ఉండి పోతాయి.



# ౮

రష్యా ప్రభుత్వం కూడా టాల్‌స్టాయి జీవికను మొదణ్నుంచి సందేహ దృష్టితోనే చూస్తూంది. అతని పుస్తకాలు ముద్రించడానికీ-ప్రచురించడానికీ ప్రభుత్వం నిషేధించింది. నిషిద్ధభాగాలు పేరుచెప్పి ఆతని పుస్తకాలకి పుస్తకాలే నిషేధించేరు. వ్రాసిన టాల్‌స్టాయికే విధమైన నిషేధం- నిర్బంధం లేకపోయినా అతని పుస్తకాలు- పుస్తకాలు కలవాళ్లు- అమ్మేవాళ్లు కఠిన శిక్షలకి పాలుచెయ్య బడసాగేరు. ప్రభుత్వం తీసుకొన్న ఈ కఠిన చర్యల వలన రష్యా దేశంలో మాత్రం లియో టాల్‌స్టాయి పుస్తకాలకి వ్యాప్తి కలగలేదు గాని ఇంగ్లీషు ఫ్రెంచి- జర్మనీ- స్వీస్- మొదలైన విదేశ భాషలలోని కాతని మూలగ్రంథాల కనేక అనువాదాలు వ్రాయబడి విశేషమైన వ్యాపకం చెందినాయి. జర్మనీ భాషలో అతని గ్రంథాలన్నీ పదేసి ముద్రణలకి పైగా ముద్రించబడ్డాయి.ఆంగ్ల భాషలో ఆతని గ్రంథాలకి కలిగిన వ్యాప్తి మరేగ్రంథాలకి లేదు. ఒక్క-రష్యా మినహాగా మిగిలిన ప్రపంచం అంతా టాల్‌స్టాయి మీద అతని గ్రంథాల ద్వారా భక్తి కుదుర్చుకుంది. రష్యా ఆతని ఆదర్శ జీవితం

చూసి ఆతని మీద భక్తి కుదుర్చుకుంది. ఆతని పుస్త
కాల వెనుకనే ఆతని జీవిత చరిత్ర కూడా దేశాలన్నింట
ప్రచురించ బడింది. దానితో టాల్‌స్టాయి ప్రపంచాని
కొక దివ్యపురుషుడుగా తోచేడు. వివిధ దేశాలనుంచి
ఎందరో ఆ మహాపురుషుని ప్రత్యక్షంగా చూచి ధన్యులు
కావడానికి రష్యాకి వచ్చి పోసాగేరు. ప్రపంచానికి
రష్యా తీర్థక్షేత్రం ఐనది.

మూడవ జార్ నికోలస్ కూడా లియో టాల్
స్టాయి విదేశాలలో నేమి- స్వదేశంలో నేమి పొందు
తూన్న గౌరవం- పలుకుబడి చూచేటప్పటికి చలించిపో
యాడు. సైన్యాలతో తనమీద నెత్తివచ్చిన శత్రువు
కంటె— నిరాయుధుడై యున్న టాల్‌స్టాయె ఎక్కువ
భయంకరుడని ఆతడు బెదిరిపోయినాడు. కాని ఎంత బెద
రినా-ఎంతకోపండున్నా మూడవ జార్ ఆతని నేచట్టంప్రకా
రంనిర్బంధించగలడు.ఆతడెవ్వరికీ అపకారం తలపెట్టలేదు.
తలపెట్టడు. శాంతి సందేశం ప్రపంచాని కిచ్చే ఆమహా
యోగిని నిర్బంధించే టందుకు జార్ సాహసించలేక
పోయాడు.ఇంక చేతిలోనున్న పని, వేలకొలదీ జీతాలిచ్చి
పోషిస్తూన్న గూఢచారుల్ని ఆతనివెంట బంపడం ఒక్క
టే. టాల్‌స్టాయి తిన్నతిండిలోని నంజుళ్ళ పేర్లు— పడు

కుందుకు పరచుకున్న ప్రక్కలో ఉపయోగించిన బట్టల సంఖ్యా స్వరూపాల దగ్గర్నుంచి ప్రభుత్వపు లెక్క-లలోని కొక్కేటట్లు కట్టుదిట్టం చేశాడు. ఆతని పుస్త-కాల నమ్మిన వాళ్ళ నేదో నెపం పెట్టి నిర్బంధించేవారు. పుస్తకాలున్నవాళ్ళు సందేహ దృష్టితో చూడబడే వారు. కాని జార్ టాల్‌స్టాయివంక వేలెత్తి కూడా చూప లేకపోయాడు.

రెండవ జార్‌ను చూపినందువల్ల ఉపయోగం మాట అల్లాఉంచితే ఎండలో ఉరికొక్కులకీ- దేశాంతర వాస శిక్షలకీ పాల్పడటం చూడగానే ప్రజల కాహాత్యా విధానాలమీద అపనమ్మకం కలిగింది. ఆహత్యలవలన ధనవంతులూ- దరిద్రులూ కూడా మాడిపోయారు. నిర్బంధ విధానంలోని కష్టసుఖాలు తెలియగానే- ప్రజలు టాల్‌స్టాయి అహింసా సిద్ధాంతాలలోని సత్యం గ్రహించేరు. అతనిని లక్ష్యంగా తీసుకొని ప్రజలు తమ భావికర్తవ్యం నిర్ధరించుకొనడానికి నిశ్చయించేరు.

టాల్‌స్టాయి తన యసాధారణ జ్ఞాన బోధచే రష్యా ప్రజ లందరికీ గురువు- ఆదర్శం- అయినాడు. ఆతని యభిప్రాయాల ప్రకారం సేనలలో పనిచేస్తామన్న ప్రమాణాలకి తిలాంజలు లిచ్చేసి అనేకమంది జమీం

దార్లు ప్రజా సేవయే తమ జీవిత పరమావధిగా ఏర్పరచు కొన్నారు. వారిని చూచి ప్రజలు కూడా వారి ఛాయ లలో సంచరించ సాగేరు.

1890 సంవత్సరము నాటికి టాల్‌స్టాయితో సంబం ధించి నంతవరకు రాజకీయ పరిస్థితులిల్లా ఉన్నాయి. ఆప రిస్థితులలో 1891 సంవత్సరంలో వర్షాలు కురియక దేశం అంతా క్షామ బాధకి గురియై పోయింది. చాలా జిల్లా లలో సంపూర్ణంగా పంటలు పోయినాయి. వేల కొలదీ పశువులూ ప్రజలూ- తిండిలేక కుప్పలు కుప్పలుగా కూలిపోయారు. పత్రికలలో ప్రతిరోజూ- కాగితాలకి కాగితాలు కరువును గూర్చిన వార్తల తోటే నిండి పోయావి.

ప్రజల దురవస్థలు వినీ- చూసీ- ఆతని హృదయం కదిలి పోయింది. అన్నాతురులైన ప్రజలకి తానుచేయ గలిగిన సహాయం శక్తివంచన లేకుండా చేయాలని నిశ్చయించేడు.

ఆ కరువుకి రష్యా దేశం అంతటికన్నా "రేయజా" ప్రాంతం మరీభీభత్సమై పోయింది. లియో టాల్‌స్టాయి వెంటనే తన ఇద్దర కూతుళ్లనీ మేనల్లు నొకనినీ వెంట బెట్టుకొని తనదగ్గరున్న ఏడువందల ఏభై రూపాయలతో

"రేయాజా"కు బయలు దేరేడు.

టాల్‌స్టాయి కరువు వాతబడ్డ ప్రజలకి సహాయం చేస్తూన్నట్లు దేశంలో పొక్కగానే ప్రజలలో సంచలనం కలిగింది. ఆతనికి సహాయంగా నాలుగు మూలల నుంచి స్వయం సేవకులు వచ్చిపడ్డారు. ధనికులు ధనం పంపించేరు.విదేశాల నుంచి సానుభూతి చూపుతూ తంతి వార్తలు వేలకొలదీ వర్షించేయి. ప్రపంచం అంతా సాను భూతి చూపింది రష్యాకి వచ్చిన ఆయాపత్తుకి.

టాల్‌స్టాయి భార్య దేశ విదేశాలలోని పత్రికల న్నింటిలో కరువులో నున్న రాష్ట్రాలలోని ప్రజల సహా యంకోసం ధన సహాయంకై విజ్ఞాపనలు ప్రచారించింది. వెంటనే ఇంగ్లాండు-జర్మనీ- అమెరికా మొదలైన దూర దేశాలనుంచి కూడా ధనం పోగుపడింది. ఆతడును ఆ పెద్ద పెద్ద మొత్తాలు ఖర్చు పెట్టి కాటక బాధకు లో నైన రాష్ట్రాలలో ప్రజల కనంతమైన సాయం చేశాడు. ఆతని కుటుంబంలోని వారందరు కూడా ఏదో విధంగా టాల్‌స్టాయికి సహాయం చేశారు.

వర్షాలు కురిసినాయి. కరువు తగ్గి దేశం అంతా సుభిక్షం అయింది.

ప్రపంచం అంతా టాల్‌స్టాయి చేసిన ప్రజా

సేవకి— ముక్తకంఠంతో అభినందించింది. ఒక్క రష్యాలోనే కాకుండా దేశం అతటా ఆతని పేరు మ్రోగిపోయింది.

కాని ఆతనికి తాను చేసిన పనిమీద సంతృప్తి కలగలేదు. తనకు వచ్చిన పేరుకు తగినంత పని తాను చేయలేదని ఆతని దృఢ నమ్మకం. అదీగాక ప్రజలకి తాను సహాయం చెయ్యడం గాక ఇతరుల నందర్నీ నిర్బంధించి—చేయించడం ఏంన్యాయం? మన శారీరక మానసిక శక్తులు వినియోగించి సేవ చేయడం ప్రజాసేవ అనిపించుకుంటుంది కాని— ప్రపంచ ధనం మన చేతుల్తో ఖర్చు పెట్టడం- ప్రశంస నొందడం ప్రజాసేవ అనిపించుకోదు. లియో టాల్‌స్టాయి తాను చేసినతప్పుకి చాలా నొచ్చుకున్నాడు.

"రేయాజా" నుంచి తిరిగి వచ్చిన తర్వాత టాల్‌స్టాయి The kingdom of God is within you. (భగవత్సామ్రాజ్యం నీలోనే వుంది.) అనే పుస్తకం వ్రాయడం ఆరంభించి 1893లో ప్రచురించేడు." అపకారికపకారం చేయాలి అనడంచాలా పొరపాటు. నీక పకారం చేసిన వాడికి కూడా ఉపకారమే చెయ్యి." అన్న ధర్మ సూక్ష్మాన్ని గురించి తన ధార్మిక గ్రంథాల

న్నిటిలోనూ వివరంగా వ్రాస్తూనే ఉన్నా— కేవలం దాని నొక్కదానినే విమర్శిస్తూ ఆతడీ పుస్తకం వ్రాసేడు.

ఆ పుస్తకం ప్రకటింప బడగానే రష్యాలోని ధనిక లోకం అతనని అరాజకుడని నిందించ సాగేరు.

కాని అతని అభిప్రాయాలు లోకకల్యాణం వాంఛించేవి. ఆతని యుద్దేశ్యాలు— ఆదర్శాలు- ఏ ఒక్క వ్యక్తికీ— జాతికీ- దేశానికీ సంబంధించినవి కావు. ఆతని దృష్టిలో ధనికుడు- దరిద్రుడు అన్న భేదం లేదు. "ఏమనుష్యునికీ రెండవ వాని స్వాతంత్ర్యాన్ని అడ్డుపెట్టడాని కధికారం లేదు. ఒకరి అభిప్రాయాలనూ, ఆశయాలనూ అనుకరించ డాని కెవ్వరినీ నిర్బంధించ కూడదు. బాధించ కూడదు. ప్రతీ మనుష్యుడు తన ఆచరణ చేతనే ఇతరులలో నుండే మానవత్వాన్ని ప్రబోధించి సత్యప్రియుణ్ణిగా చేయాలి. న్యాయమునం దభిమానం- ఆసక్తీ— గౌరవం— కలగచేయాలి. కాని చాలమంది ఈనీతులు పుస్తకాలలో ఉండవలసినవే గాని ఆచరింప దగినవికావని దురభిప్రాయ పడుతున్నారు. చెడుగునూ- దుర్నయాన్నీ నశింపచేయాలంటే కాఠిన్యం— క్రౌర్యం అవలంబింప వలసినదేనని వాళ్ల అభిప్రాయం. ఒకవేళ ప్రభుత్వాలు నిర్బంధ విధానం మీదనే నిలువబడి యుంటూంటే—

యుద్ధం— విచారణ- ప్రత్యేక రక్షణల మీదనే ఆధార పడి యుంటూంటే-ఇంకా ఈ ధర్మపన్నాలు చదువుకో వలసిన అవసరం ఏమిటి? క్రౌర్యం క్రోధం కార్యకారి గాదు. కనక నే- అంతకంటె ఉదాత్తమైన ఆశయాల కొఱకు వెదకులాడ వలసి వస్తూంది.

మనుష్యునిలో సహజంగా ప్రేమవుంది. న్యాయం సత్యంఅ ంటే అభిమానంవుంది. వాటిని నియమించడానికీ ప్రోత్సహించ డానికీ మనుష్య నిర్మితాలైన శాసనాలు అవసరం లేదు. అందుచేత ప్రజల్ని శాసించే టందుకు రాజు- రాజ్యాంగం ఉండనక్కరలేదు. ఉండడాన్ని ఏ మనిషీ సహించ కూడదు.ఒకళ్ల వద్ద పన్నులు పేరు చెప్పి నిర్బంధంగా డబ్బు వసూలు చేయవలసిన అవసరం ఏం ఉంటుంది. అది వట్టి దురన్యాయం. ఆ అన్యాయానికి సహాయం చేయడం మనం చేస్తూన్న గొప్ప తప్పులలో ఒకటి. ఎవ్వరూ- ఎవ్వరికీ నిర్బంధంగా ధనం ఇచ్చిగాని— బలం చూపిగాని సేవ చేయకూడదు. మనల్ని బాధించే వాళ్లని కూడా బాధించి ఎదుర్కోవద్దు. శాంతంతో వాడుపెట్టే కష్టాలన్నీ సహించి వాని హృదయాన్ని లొంగదీసుకో. నాడు ప్రపంచం అంతా ఒక్కటే. ఆ నాడు పాలించే వాడు— పాలించబడే వాడు అనేమాట

ఉండదు.

ఈవిధంగా విశ్వమానవ సౌభ్రాతృత్వాన్ని బోధిస్తూన్న The kingdom of God is within you అనే గ్రంథం టాల్‌స్టాయిని అరాజకులలో చేర్చింది.

నిజం! టాల్‌స్టాయి అరాజకుడే! కాని హత్యలు చేసీ- దోచుకొనీ— ప్రజల్ని గగ్గోలుపెట్టే అరాజకుడు మాత్రం కాదు. ఆతడు సర్వమానవ సౌభ్రాతృత్వాన్ని బోధించే అరాజకుడు. మనుష్యునికి సర్వోత్తమమైన నైతిక— సామాజిక ధర్మాల్ని బోధించే అరాజకుడు. అతని అరాజకత్వం లోక కళ్యాణాన్ని వాంఛిస్తుంది.



లియో టాల్‌స్టాయి అనేక సమయాలలో అనేక విషయాల మీద నాసక్తి కనపరస్తూ వచ్చేవాడు. కాని కళల మీద నెప్పుడూ కూడా అభిమానం చూపుతూనే ఉండేవాడు. ఆతడు కళయంటే ఏమిటో నిర్ణయించడానికి నిర్వచించడానికి, మరేయితర విషయానికి వ్యయము చేయనంత కాలం వినియోగించేడు.

తాను 1895. లో ప్రకటించిన What is art? అనే పుస్తకంలోని అభిప్రాయాలు ప్రకటించే టందుకు పదిహేనేళ్లు పట్టినాయని ఆతడే వ్రాసినాడు. అహింస-ప్రజాసేవ— అనే సిద్ధాంతాలను స్ఖాలిత్యం లేకుండా నిర్వహించిన జీవితమె కళయొక్క స్వరూపమని యాతడు సిద్ధాంతీకరించేడు. కళ అంటే నాటక శాలలలో చూసేదీ గాన సభలలో— వినేదీ— భవనాలు- సుందర నిర్మాణాలు— ప్రతిబింబాలు- పద్యాలు— నవలలు- మొదలైన వాటిలో ప్రత్యక్షమయ్యేదే అనే ప్రజాభిప్రాయం పొరపాటు. ఆది కళలో ఒకభాగం మాత్రమే! మానవ జీవిత మంతా కళయే. మనుష్యులేమి— జంతువులేమి తమ అభిప్రాయాల నితరులకి తెలియచేయు డానికి ఉపయో

గించే ప్రతీ విధానం కళే. తనభావాలని- తన సేవలని- ఇతరుల హృదయాలకు పట్టించి తనతో సమానమైన భావావేశం కలవాళ్లనుగా చేయడానికి మనుష్యుడుప యోగించే బాహ్యాభ్యంతరికాభినయమే కళ. అది వచోరూపంలో ఉండవచ్చు. చిత్రరూపంలో ఉండవచ్చు. సేవారూపంలో ఉండవచ్చు. అది యే స్వరూపంలో నున్నా కళయే.

"What is art?" పూర్తైన వెనుక టాల్‌స్టాయి 1896 లో, "How to read Gospels." అనే కరపత్రాన్నొక దానిని ప్రచురించేడు. మతప్రవక్తలు మనుష్యాతీతమైన బుద్ధి ప్రతిభ కలవాళ్లనే దృఢ నమ్మకంతో మతగ్రంథాలు చదువుతే వారి బోధలలోని నిజానిజాలు గ్రహించ లేమని ఆతని నిశ్చయం. "ప్రవక్తలు కూడా మనుష్యులే. వాళ్లు బోధించేది కూడా ప్రతీ మనుష్యుని హృదయంలోనూ పుట్టేభావాలే. వారిని వారి అభిప్రాయాలను మనుష్యాతీతాలని నమ్మినట్లయితే పూర్ణత్వం పొందేప్రయత్నంలో వాళ్లకి కలిగిన అనుభవాలు తెలుసుకోలేము. వారి జీవితాల వలన, బోధల వలన ఆవగింజంతయైనా లాభం పొంద లేము." అని టాల్‌స్టాయి అచంచల మైన భావం.

దీని వెనువెంటనే " Tsar's cornation. " అంటూ వేరొక కరపత్రం ప్రచురించేడు. ఈరెండూకూడా దేశంలో మంచి సంచలనం కలిగించినాయి.

వీని తర్వాత రెండేళ్ళకి 1898 లో Right and wrong అని ఇంకో కరపత్రం ప్రచురించేడు. ఆతని మానసిక యంత్రణని— పరిస్థితులని— ఆవేశాలని తెలియపరచే ఈపుస్తకం దేశ విదేశాలలో విపరీతమైన ఖ్యాతీ— ప్రచారము పొందింది.

ఇన్ని గ్రంథాలింత శ్రద్ధతో వ్రాస్తూన్నా, తన జీవితం అంతా మానవజాతి యొక్క కల్యాణం కొఱకై వినియోగిస్తూన్నా, టాల్‌స్టాయి ఎప్పుడూ తన పనుల విషయంలో సంతృప్తి పొందలేదు. అడుగడుగుకీ ఆతడు ఇంతకన్న అధికమైన పని చేయలేక పోయామే అని విచారించేవాడు. ఆతని పుస్తకాలని గురించి మాట్లాడినా ఆతని కార్యప్రణాళికను గురించి మాట్లాడినా ఏమాత్రం దాపరికం— అభిమానం, లేకుండా— వాటిలోని లోటు పాట్లు— పొరపాట్లు స్పష్టంగా విమర్శించుకొనేవాడు. What is art? అనే పుస్తకంలో తెలియపరచిన అభిప్రాయాలు స్పష్టం కావడానికి పదిహేనేళ్ళు పట్టినాయని చెప్పుతూ, ప్రజాసామాన్యాని కుపయోగించని విషయం

కొంతకాలం వ్యర్థంగా పాడుచేసినందుకు ఆతడు చాలా విచారించేడు.

What is art? వ్రాస్తూండగా ఆతని స్నేహితుడు "కోనీ" ఒకని జీవితంలో సంభవించిన ఒక ఘటనను టాల్‌స్టాయి చెవిని వేశాడు. ఆతడు ఆకథవిని దాని నొక నవల రూపంలోకి తెస్తే చాలా బాగుంటుందని ఆలోచించి యాకథ వ్రాసుకొన్నాడు. ఏ గ్రంధముకన్నా నవలలు ప్రజలని చులాగ్గా ఆకర్షిస్తాయని ఆతడెరుగును. కాని నాటికి కళమీాది అభిమానం నవలారచన నాపుచేసింది. అప్పటికింకా What is art? పూర్తికాలేదు. The Christian teaching అపూర్ణంగానే ఉండిపోయింది. ప్రస్తుత విద్యా విధానాన్ని విమర్శిస్తూ ఆదరణీయమైన విద్యా పరిణాళికను గూర్చి చాల కాలం నుంచి వ్రాయాలనుకుంటున్నాడు. కాని అది సాగడం లేదు. జీవనం— మరణం— ప్రపంచం- ప్రజలు— మంచితనం, అదృష్టం, భగవంతుడు, ప్రజల విశ్వాసాలు, ఆచారాలు మొదలైన వాటిని గురించి ఏమాత్రం చదువుకొన్నవాడికైనా అర్థమయీాలా ఏదైనా తాత్విక గ్రంథం వ్రాయాలని ఎప్పటినుంచో ఉంది కోరిక. ఈ మాదిరి అభిప్రాయాలే ఆనవల వ్రాయబడుతూన్న రోజులలో

ఎప్పటి కప్పుడప్పు తగులుతూండేవి. కొంత వ్రాయడం మూల బడెయ్యడం; మళ్ళీతీయడం-మళ్లీ మానడం; ఈవిధంగా రెండు మూడేళ్ళకా కథని Resurrection అనే పేరుతో పూర్తి చేశాడు. చిత్తుకాపీ పూర్తయే టప్పటికి టాల్‌స్టాయి ప్రాణం విసిగింది.ఇంక దాని కోసం ఒక్క క్షణమైనా వ్యర్థం చేయకూడదని నిశ్చయించి దాని నొకమూల పారేశాడు కాని ఏదియో అదృష్టం వల్ల అది ప్రజల కంట బడడాని కవకాశం కలిగింది

1895 లో కాకేషియా లోని డాకోబర్లు టాల్‌స్టాయి సిద్ధాంతాల ప్రకారం ప్రభుత్వ తో శాంతియుద్ధం ఆరంభించేరు. మొదటవారు సైన్యాలలోచేరడానికి నిరాకరించేరు.ప్రభుత్వం తప్పదంది. దానితో వైరుధ్యాలు పెరిగినాయి. వేలకొలది జైళ్లలో తోసివేయ బడ్డారు. ఒక్క జిల్లాలో నున్న నాలుగు వేలమంది డాకోబర్లని ఇండ్లనుంచి తరిమి అనారోగ్య కరాలయిన ప్రదేశాలలో నిర్బంధించడం వలన రోగాలకి- ఆకలికి- బాధలకి మూడేళ్లలో ఇంచు మించు వేయిమంది చచ్చిపోయారు. దేశంఅంతా పెద్దగందర గోళం అయిన మీదట చిట్టచివరకి ప్రభుత్వం వాళ్లకిష్టం వచ్చిన చోటుకి వలసపోవడానికధికారం ఇచ్చింది. కాని సైన్యాలలో పని చేయుడాని

కోప్పుకున్న వాళ్లు దేశం విడవనక్కరలేదు. విప్లవోద్య
మానికి నాయకులయిన 130 మంది దేశం విడవడానికి
వీలులేదు. మిగిలిన వాళ్లు స్వతఖర్చుల మీద తోచిన
చోటికి పోవచ్చును గాని మళ్లీ దేశంలో అడుగు పెట్టితే
నిర్బంధించబడుతారు.

నిబంధనలు కఠినంగానే ఉన్నాయి. కాని తమ
కిష్టంలేని పని చేయడం లేక ఖైదులో ఉండడం కన్న
దూరదేశాలు పోవడమే మంచిదని నిశ్చయించేరు. కాని
డబ్బేది?

టాల్‌స్టాయికి వాళ్ల అవస్థలు చూచేటప్పటికి
చాలా జాలి వేసింది. తనతో సమానమైన అభిప్రాయం
కలవాళ్లు తిండిలేక మాడుతూంటే తాను ముప్పొద్దులా
మెక్కడం చాలా అన్యాయం అని తలచేడు. వాళ్లకిప్పుడు
డబ్బుకావాలి. సహాయం చేసే వాడెవ్వడూ లేడు. కాని
తానుకోరితే చాలమంది ధన సహాయం చేయవచ్చును.
కాని ఆతనికి చందాలు పోగుచేసి ధర్మకార్యాలు నిర్వ
హించడం అన్యాయం అని నమ్మకం. అనేకమంది తమకు
ధనం ఆవశ్యకమైనా మోమోటం చేత ధనం పంపవచ్చు.
ఆ ధనం తనపేరుతో ఖర్చుపెట్టబడుతుంది. దానిని ప్రోగు
చేయడం లోను ఖర్చుపెట్టడం లోను అమూల్యమైన

కాలం వ్యర్థం అవడమే కాకుండా దుర్వినియోగం కూడా చేయబడ వచ్చు. పరిస్థితులు తారుమారు కావచ్చు. కనక బుద్ధుడు— క్రీస్తు సోక్రిటీసు మొదలైన ప్రవక్తలు చెప్పినట్లు ధనంతో సంబంధం తగ్గించుకొనడమే, శ్రేష్ఠమని టాల్‌స్టాయి నమ్మేడు. ఆనమ్మకం మారదు. తనశక్తి, తన ధనం వినియోగించి చేసిందే సేవ అని నిశ్చయించి తన స్వశక్తి వలననే ధనం ఆర్జించి డాకోబర్లకి సాయం చేయడానికి నిర్ధరించేడు.

వెంటనే Resurrection పైకితీసేడు. కానిస్వత్వం అమ్మడానికతడంగీకరించలేదు. టాల్‌స్టాయి అందుచేత మొదటి మాటు ముద్రించే అధికారం మాత్రం అమ్మి ఆధనం డాకోబర్లకిద్దామనుకున్నాడు. అతడా అభిప్రాయం తెలియ పరచగానే పీటర్స్‌బర్గ్ లోని యొక వారపత్రికా సంపాదకుడు మార్క్స్ అనునాతడు ప్రథమంలో ముద్రించేటందు కవకాశం ఇస్తే 12000 రూపాయలిస్తానన్నాడు. స్వత్వం ఇచ్చేస్తే 30000 రూపాయలిస్తానన్నాడు. టాల్‌స్టాయి ఎంతడబ్బిచ్చినా స్వత్వంఅమ్మనన్నాడు. పన్నెండు వేలకే ఒప్పుకొని ప్రతీవారం కొంత కొంత భాగం ఇయ్యడాని కొప్పుకున్నాడు.

కాని పుస్తక ప్రచురణం ఆరంభమైనంతనే ఎదురు

చూడని బాధలు కొన్ని తటస్థ మైనాయి. మార్క్సు పత్రిక ప్రచురణ మైనంతనే ఇతర పత్రికల వాళ్లా భాగాలు తమ పత్రికలలో కూడా ప్రచురించడం ఆరంభించేరు. దానితో మార్క్సు తన ప్రచురణం పూర్తయ్యే దాకా నైనా ఇతరులని ప్రచురించ నీయవలదని పేచీ తెచ్చేడు. వెంటనే టాల్‌స్టాయి పత్రికలలో నొక ప్రకటన చేశాడు. మార్క్సునకు తానిచ్చిన అధికారం రక్షించమని పత్రికా సంపాదకులను బహిరంగలేఖ ప్రచురించేను. దానితో ఆ గోల అణిగింది. మార్క్సు సంతోష పూర్వకంగా అనుకున్న దానికి పదివేలు చేర్చి అతని చేతిలో పోశాడు.

టాల్‌స్టాయి తన రచన కెప్పుడూ తృప్తి పొందే వాడు కాడు. ప్రూఫులు వచ్చేక కూడా భాగాలకి భాగాలు మారిపోయేవి. ముద్రణాధికారం ఇచ్చేక కూడా మార్పులు పంపేవాడు. మరల కంపోజిటర్లు, అనువాదకులు, చేసిన పని మూలకి తోసి మళ్లీ ఆరంభిస్తూండే వారు. అందుచేత పీటర్సుబర్గులో ప్రచురణ మయ్యేదాకా ఇతర పత్రికలకి— ఇతర దేశీయులైన అనువాదకులకి శుద్ధప్రతి దొరకేదికాదు. ఇది కూడా ఇతర పత్రికల వాళ్ళకి గొప్ప అడ్డంకి తెచ్చిపెట్టింది

Resurrection ప్రచురణం ఆరంభ మైనంతనే

ప్రభుత్వం ముద్రణాశాసనం ప్రయోగించింది. చర్చికీ— మతంకీ విరుద్ధములైన భాగాలు, ప్రభుత్వరహస్యాలు తెలియపరచే ఘట్టాలు ఎప్పటికప్పుడు నిషేధించబడేవి. సైబీరియాకు పంపబడే ఖైదీల దురవస్థలు- సైనికుల దురవస్థలు— పీటర్స్‌బర్గు జైలు దురంతాలు— వర్ణించ బడిన భాగాలు నిషేధంలోకి వచ్చేయి. మొత్తంమీద ప్రభుత్వం నిషిద్ధభాగాలపేరు చెప్పి పుస్తకం అంతా అదృశ్యంజేసింది.

Resurrection కి ప్రపంచ సాహిత్యం గొప్ప స్వాగతం ఇచ్చింది. జర్మనీభాషలో కొద్దినెలల లోపు గానే పన్నెండు ముద్రణలు ప్రకటించ బడినాయి. స్వీడిష్ స్లేవోక్— ఇంగ్లీషు— ఫ్రెంచిభాషలలో ఎన్నో అనువాదాలు బయలుదేరినాయి. ఒక రష్యాలో మినహాగా పుస్తకం యొక్క నిజరూపం యూరపంతా వ్యాపించింది.

కాని టాల్‌స్టాయి మనస్సుకు తానుచేసిన పని సంతుష్టికరం కాలేదు. ధర్మకార్యం కొఱకైనా ధనం సంపాదించడం మంచిదా? అనే విమర్శలో పడిపోయేడు. ఆతని అంతరాత్మ తప్పని చెప్పింది. మనస్సు వికలత్వం చెందిందీ యూహతో. కాని వ్రాయక తప్పదు. ప్రూఫులు దగ్గిర కూర్చునప్పుడు- వ్రాయడానికి మొదలు పెట్టిన

ప్పుడు ఆతని మనస్సెంతో బాధపడేది. చివరకి గ్రంథం పూర్తయింది. టాల్‌స్టాయి పునర్జన్మ పొందినట్లు తలచుకొని ఒక్కనిట్టూర్పు విడిచేడు.

Resurrection ప్రచురింప బడినంతనే ఫాదరీలు టాల్‌స్టాయి మిథ్యా సిద్ధాంతాలు ప్రచారం చేస్తూన్నాడనేకారణం చెప్పి ధర్మచ్యుతుణ్ణి [వెలి] చేశారు. ఆప్రకటన వెలువడిన రోజున మాస్కో ప్రజలు ఆశ్చర్యపడిపోయేరు. విద్యార్థులు మతబోధకులతో దొమ్మికి దిగిరి. వ్యవసాయకులంతా విద్యార్థుల పక్షం పూటుచేశారు. ఆరోజున సాయంకాలపు షికారుకు బయలుదేరిన టాల్‌స్టాయిని ప్రజలంతా చుట్టుకొని యాతని కభివందనాలు తెలిపేరు. ఆప్రజలను తప్పించుకొని ఇంటికి వచ్చునప్పటికి అనేకమంది స్నేహితులు,అనేక సంఘముల వ్యక్తుల ప్రతినిధులు, ఆతనికి సానుభూతి చూపుటకు చుట్టువారుకొన్నారు.

టాల్‌స్టాయి వెంటనే ఫాదరీల ఈ ప్రకటనకు సమాధానంగా ఇంకొక ప్రకటన చేశాడు. దానిలో క్రైస్తవ మతధర్మం విషయంలో తన యభిప్రాయాలు సవిమర్శంగా వివరిస్తూ చిట్టచివర—

"నేనొక్క గ్రీకుచర్చి కనుయాయినే గాక,

క్రైస్తవ మతానికి కూడా అనుచరుడనని చెప్పజాలను. ఏమంటే, క్రైస్తవ మతస్తుడనని చెప్పినట్లయితే, మతం విషయంలో నాకున్న స్వతంత్రాభిప్రాయాలు ప్రకటం గావు. సత్యం నాకధికప్రియం. అదే నామతం. ఆ సత్యం నుంచి నన్నెవ్వరూ పతితుని జేయలేరు. "
అని తన అభిప్రాయాలు స్పష్టం జేశాడు. 1900 లో అహింసాయోగాన్ని, ఆర్థిక– రాజకీయముల కనుబంధింప జేస్తూ టాల్‌స్టాయి స్వచ్ఛమైన భాషలో The- slavery of our times. అనే పుస్తకం ప్రచురించేడు.

1902 లో What is religion and what is its essence. అంటూ ఇంకొకపుస్తకం ప్రచురించేడు.

ఆతడు వ్రాసిన పుస్తకాలలో ఇవే ఆఖరువి అని చెప్పవచ్చు. తరువాత నాతడు వ్రాయకపోలేదు గాని అవియన్నీ చిన్న చిన్న వ్యాసాలే.

1905 లో రష్యా దేశంలో విప్లవం జరిగింది అప్పుడు జరిగిన రక్తపాతం ఆతని హృదయం కదల్చి వేసింది. మనుష్యునిలోని రక్తపిపాస యాతని కాశ్చర్యాం కలిగించింది. గొప్ప హృదయవేదనతో నాతడు విశ్వమానవ సౌభ్రాతృత్వం– ప్రేమ– అహింసా సిద్ధాంతాలని గురించి విశేషమైన ప్రచారం చేశాడు.

1908 లో రష్యన్ ప్రజలు టాల్‌స్టాయికి ఎనుబ
దవ జన్మ దినోత్సవం గొప్పసమారోహంతో చేయాలని
నిశ్చయించేరు. ఆవిషయాన్ని గురించి పత్రికలలో వాదో
పవాదాలు బయలు దేరినాయి. ఫాదిరీల పక్షంవారు
టాల్‌స్టాయి నాస్తికుడనీ- ఆతనిని గౌరవిస్తే పాతకం
చుట్టుకుంటుందనీ ప్రచారం ప్రారంభించేరు. ప్రజలంతా
టాల్‌స్టాయి ఆధ్యాత్మిక తత్వవేత్త అనీ- మహాకవి అనీ-
ఆతనిని గౌరవించడం రష్యాని గౌరవించడం అనీ వాదిం
చేరు. చివరకు ఆ విషయంలో ప్రభుత్వం కూడా చేయి
చేసుకొని ఆతని నాధ్యాత్మిక తత్వవేత్తనుగా కాకుండా
కవినిగా పూజిస్తే తమ కభ్యంతరం లేదన్నారు. అందుచేత
నాటి సభలలో ఆతని సిద్ధాంతాలను గురించి బహిరం
గంగా చెప్ప[illegible] వీలులేక పోయింది. కాని ప్రజలు
ఆతనిని [illegible]లో [illegible] మాత్రం చేయలేదు.
రష్యా [illegible] మహాత్ముని జన్మదినో
త్సవం [illegible] గల భక్తి [illegible] కన
బరిచి[illegible].

ఆ[illegible] ఆధ్యాత్మిక విచారణ

మారంభించిన నాటనుండీ- ఎవ్వరూ పెద్దఆస్తి కలిగిఉండ కూడదనే అభిప్రాయం కలిగియే యున్నాడు. ఆతడు తన కున్న ఆస్తి నంతా పంచిపెట్టి వేయ్యాలనే ఉదారాభిప్రాయం కలిగియే ఉన్నాడు. కాని ఆతని కోరిక సాగలేదు. ఆతని భార్య సోఫియా, టాల్‌స్టాయి సర్వసమానత్వం అనే సూత్రానికి కేవలం వ్యతిరేకాభిప్రాయాలు గలది. ఇతర విషయాలలో ఆమె యాతని కెంతయను వర్తను రాలైనా భర్తయొక్క- ఈ మాటకామె పూర్ణంగా వ్యతిరేకం. ఒకమాటామె టాల్‌స్టాయి పిచ్చివాడనీ- ఆస్తిదుర్వ్యయం చేస్తూన్నాడనీ- ప్రభుత్వానికి అర్జీపుంపడానికి కూడా సిద్ధమైనది. ఆమె, సంతానము, విలువైన బట్టలు కట్టి, ఖరీదైన భోజనం చేస్తూండేవారు. వాళ్లమధ్య టాల్‌స్టాయి శాకాహారియై సామాన్య వస్త్రధారియై మహాయోగివలె కాలక్షేపం చేసేవాడు.

కాని ఆయునికి ఆతనికే దుర్భరం అనిపించేది. వాళ్లమూలంగా తాను కూడా మారి పోతానేమో ననే భయంతో ఎక్కడికైనా చెప్పకుండా పారి పోవాలని చాలామాట్లు అనుకున్నాడు. కాని సహాయించి ఊరుకున్నాడు.

చిట్టచివర కాతని ప్రాణం విసిగింది. ఈ భావ్రి

పిల్లలు— వస్త్రాలకి దూరంగా తెలియ బడని ప్రదేశంలో జీవితాంతం దాకా కాలక్షేపం చేయాలని నిశ్చయించు కొని 1910 నవంబరు 10 వ తేదీ పొద్దుటే లేచి సామాను నుసర్దుకొని రైలు స్టేషనుకు పోయాడు. ఆతనితో డాక్టరు మేకోవిట్స్ కూడా యున్నాడు.

టాల్‌స్టాయి డాన్ నదీతీరానయున్న "రాస్టోవ్ కు" టిక్కెటు తీసుకొని బండి యెక్కేడు. ఆతని యభిప్రాయం తన్నెవ్వరూ గుర్తించలేరనే. పోలీసు గూఢచారు లాతని వెన్నంటియే యున్నారని యాతడెరుగడు.

టాల్‌స్టాయి శరీరమతి దుర్బలం. ఆతని భార్య సోఫియా పరిచర్యల వలన నాతడింతకాలం మనగలిగేడు కాని లేకపోతే టాల్‌స్టాయి ఎన్నడో ఈలోకం విడియుండవలసిన వాడే. ఆతని దౌర్బల్యానికి వార్ధక్యం తోడు పడింది.

మంచి నడి శీతకాలం. రైలుబండి "అష్టపోవో" స్టేషనులో నుండగా టాల్‌స్టాయికి జలుబు చేసింది. అతని కూడానున్న డాక్టరు ఆతనిని వెంటనే దింపివేసేడు. టాల్‌స్టాయివంటి మహాత్ముడు తనకతిథియైనందుల కానందించి ఆస్టేషను మాష్టరుఆతని కాశ్రయం ఇచ్చేడు. ఆతడు జబ్బు పడగానే పత్రిక

[illegible] ఆవిషయం ప్రచురింపబడింది. వేలకొలదీ ప్రజలు ఆమహాత్ముని దర్శనానికి "ఆస్టపోవో" చేరుకొన్నారు. వివిధమైన అల్లరులు జరుగకుండా సాయుధ సైన్యాలు కాపలా కాస్తూన్నారు.

టాల్‌స్టాయి జబ్బు పడిన వార్త అతని కుటుంబానికి తెలియపరచ బడింది. సోఫియా మాస్కోలో వెంటనే "ఆస్టపోవో" చేరింది కాని టాల్‌స్టాయి కంట బడలేదు. ఆమె యెదుట బడిన, ఉద్రేకంచేత నాతని గుండె ఆగి పోవచ్చునని తెలివి యున్నంత వరకు, సోఫియా నాగదిలో డాక్టరులు కాలు పెట్టనీయ లేదు.

టాల్‌స్టాయి జబ్బు పడిన వార్త తెలియగానే రష్యా అంతా చకితమై పోయింది. ఆమహాత్ముని శరీర స్థితి నిముష నిముషం తెలుసుకొన డానికి ప్రజలాతురులై పోయారు. ఆనాటి ప్రజలకి అతని మీద నెంత ప్రేమ యున్నదో తెలుసు కోవాలంటే నాటి తంతి వార్తలు కొన్ని చదివితే చాలు. ఒక తంతివార్త యిట్లుంది.

"గ్రంథకర్తయైన కౌంట్ టాల్‌స్టాయి రైలులో 12గంటలకి జబ్బు పడ్డాడు. అజోలిన్ స్టేషను మాష్టరు ఆయన కాశ్రియం ఇచ్చేడు."

ఒక పత్రికా విలేఖరి యీక్రింది వార్త పంపేడు.

"గాఢాంధకార బంధురమై, వర్షముచే నావరింపబడిన యీ

శరత్కాలపు నిశీధము ఇక్కడనున్న వారందరికీ హృదయ వేదన కలిగిస్తూంది. రష్యా దేశపు భానుడస్తమించునా ఇక? ”

టాల్‌స్టాయి అంతిమ కాలం దగ్గరపడిన కొలదీ ప్రజల ఆతురత అధికమౌతూంది. ఒక తంతివార్త ఇట్లుంది.

“ అపాయకరమైన హృదయోద్రేకం ”

ఇంకొకటి “ సంసిద్ధులకండి. ” అని పోలీసు హెచ్చరిక నిస్తూంది. ఇంకొకటి [౨౦ నవంబరు ౧౯౧౦.]

“ 3 గంటలు. ఉపద్రవకరమగు స్థితి. ”

వేరొకటి.

“ కాళ్లు వెచ్చగానే ఉన్నాయి. ”

ఒకటికి.

“ 5 గంటలు. హృదయం అకస్మాత్తుగా బలహీనమైపోయింది స్థితి విషమించింది. మంచు, గాలి, పోలీసు కావలాలు. ”

5 నిమిషాలైన తర్వాతి వార్త.

“ టాల్‌స్టాయి మరణించేడు. ”

* * * *

టాల్‌స్టాయికి దేవాలయాలలో అంతిమ క్రియలు జరిపించడానికి ఫాదరీ లంగీకరించేరు కారు. కారణం?—

ఆదివ్యాదర్శాలన్ని క్రైస్తవమతం తనలో ఇముడ్చుకోలేదు ఆమహాశక్తిని ఆబూటకపు మత నిబంధనలు భరించ

లేవు! కనుక పాఠకులు తమ శక్తికి మించిన దానిని తమ కయిష్టంగా ప్రకటించి తమ యసమర్థతని కప్పి పుచ్చేరు.

కాని — ప్రజలు పెద్ద సమారోహంతో ఆతని కంత్యక్రియలు జరిపి స్వగ్రామంలోనే సమాధి చేశారు.

* * * *

టాల్‌స్టాయి మరణంతో ప్రపంచం ఒక మహాత్ముని — మహాకవిని కోల్పోయింది.

ఆతని అభిప్రాయాలు ఆదర్శప్రాయాలు. నిష్కలుషాలు. పరిపూర్ణత్వానికి మార్గదర్శకాలు.

ఆతని కవిత్వం ధారాళమై, స్పష్టంగా ఉంటుంది. ఏవిషయమునైనా ప్రజాకర్షకంగా వ్రాయగలిగి యుండడం ఆతనిలోవున్న గొప్పదనం.

పై ప్రకరణాలలో చెప్పిన నవలలు, ఆధ్యాత్మిక గ్రంథాలేకాక అప్పుడప్పు ఊతజెన్నో నవలలు వ్రాసేడు

ఆధ్యాత్మిక ప్రపంచంలో అంత పూర్ణత్వం పొందినవారు, సాహిత్య ప్రపంచంలో అంత విశాల ఖ్యాతి పొందినవారు, ఏదేశంలోను — ఏకాలంలోను తక్కువే. ఆ రెండు రంగములలోను ఒకేమారు అంత తుకీయావస్థకిపోయినవాడొక్క టాల్‌స్టాయే!

